# నందక విజయము

## ( లేక )

## అన్నమాచార్య చరిత్ర




రచయిత :

**రామాయణం వేంకట నారాయణరాజు**

26/988, రామేశ్వరం,

ప్రొద్దుటూరు - 516 360. కడప జిల్లా.

ఆం. ప్ర.

ప్రథమ ముద్రణ :
డిశంబర్ 1995

ప్రతులు : 1000 కాపీలు



గమనిక:- ఈ నాటకము ప్రదర్శించువారు రచయిత అనుమతి పొందవలయునని కోరిక.

వెల రు. **25-00**

ముద్రణ :
**సిటి ప్రింటర్స్,**
శ్రీ వివేకానంద క్లాత్ మార్కెట్,
ప్రొద్దుటూరు.



కదానాయకునికే కాక కృతికర్త - నట ప్రేక్షక వర్గాలకు అందరికీ ఇలవేల్పయిన

శ్రీ వేంకటేశ్వర పరబ్రహ్మ స్వరూపానికి మనసారా -

## అంకితం



రామాయణము వేంకటనారాయణరాజు
ధర్మపత్ని రామాయణము వేంకట సుబ్బమ్మ

యల్లంరాజు శ్రీనివాసరావు M.A.,
బహుభాషాకోవిద-సాహిత్య-తత్త్వ విశారద

ప్రొద్దుటూరు.
1-10-95

# అభినందనము

చిరంజీవి వర్ధమానుడు ఆర్.వి. నారాయణరాజు రచించిన నందక విజయము నామూలాగ్రము పరిశీలించి చూచాను. నిజంగా అభినందించవలసినదే ఇతని కృషి ఇది పదహారంకములతో సాగిన ఒక పెద్ద నాటకం. పదహారు కళలతో వెలుగొందు చంద్రునిలాగా వెలుగొందుచున్న దీ కళాఖండం.

ప్రసిద్ధ భాగవతుడూ పదకవితా పితామహుడూ శ్రీమాన్ తాళ్ళపాక అన్నమాచార్యుల జీవిత చరిత్ర ఇందులోని కథావస్తువు. అయితే చరిత కేవలం చరితగానే వ్రాయలే దీ రచయిత. ఈ రచయితేగాదు అసలు ఏ నాటక రచయితా అలా వ్రాయకూడదు, వ్రాయడు. ఎంతో కొంత మార్పులూ చేర్పులూ చేసినప్పుడే అందం, అదికూడా సప్రయోజనంగా ఉన్నప్పుడే సముచితం. తద్వారా రసికలోకానికొక గొప్ప సందేశ మందివ్వడమే అందులోని ఔచిత్యం.

ఇది అనంత పద్మనాభరావు గారు కొంత ఇంతకుముందే సాధించారు. ఆయన రచించిన అన్నమాచార్య అనే నాటకం ఇలాంటి ఔచిత్యాన్ని పాటించి రచించిందే. ప్రస్తుతం మన రాజుకూడ అదే పరవడిలో పయనించినాడు. అన్నమాచార్యులకిద్దరు భార్యలని చెప్పడం ఐతిహ్యమైతే అందులో ఒకరు మొదట చేసుకొన్నదికాదు ఒక గాయని, నర్తకి, తిరుమలమ్మ కాలధర్మం పొందిన తరువాత అక్కమాంబ అనే ఈ గాయనిని, సంగ్రహించాడు. అన్నమయ్య - అని చెప్పడం ఒక మార్పు, మరొక ముఖ్యమైన మార్పు అన్నమయ్య పురందరదాసుల సమాగమం, ఇవి రెండు నారాయణరాజుకూడ అనుసరించాడు, తన నాటక నిర్మాణంలో.

ఒక రక్తుడైనవాడు భక్తుడుగా మారటానికి జీవితంలో ఏదోఒక ప్రబలమైన వ్యక్తి కారణమవుతూంటుంది. చాలావరకది ఒక సంస్కారవతి అయిన స్త్రీ అయిఉంటుంది. తులసిదాసేమి-తుకారామేమి-బిళ్వమంగళుడేమి-విప్రనారాయణుడేమి-ఇలాటి మహనీయుల చరిత్రచూస్తే మనకిది చక్కగా తార్కాణమవుతుంది, ఆకోవలోనే అన్నమయ్య జీవితం మలుపు తిరిగిందని చెప్పడంలో

అందముంది. ఔచిత్యముంది, అలాగే పురందరునిలాంటి సాటి బాగవతుడ
సంగీత కోవిదుడితో సమాగమంలోకూడా పరస్పరాభినందన, ఉదాత్తవినయాద
సుగుణసంపత్తి ఎంతగానో వ్యక్తమవుతుంది. ఇవన్ని రచయిత దృష్టిలోవుంచ
ఈ నాటక సృష్టి చేశారు. దృష్టినిబట్టెగదా ఏ సృష్టి అయినా.

పోతే యీ రచయిత గద్యం పద్యం రెండూ చక్కగా సాగాయి, పాత్రో
చితమైన శైలికూడా పాటించడం ఒక విశేషం. మరి పద్య రచన అన్వయ
క్లేశంమాత్రం లేక ఒక జీవనదిలా స్వచ్ఛంగా నడుస్తూపోయింది. చివరదా
రచయిత జాషువా జంధ్యాలలాంటి కవుల పద్యాలు వందలకొలది వల్లించినాడ
అలాంటి రచనమీద ఎనలేని మక్కువ ఉన్నవాడు మరి. ఎక్కడికి పోతు
దాసంస్కారం. తప్పకుండా అభివ్యక్తమవుతుంది. స్వీయ రచనలో - అలా
అయిందికూడా.

పోతే అక్కడక్కడా అవకాశం దొరికినపుడల్లా అన్నమయ్య కీర్త
ఉదహరించడ మొకగొప్ప విశేషం. సంభాషణలుకూడా నాటకంకాబట్టి నా
దీర్ఘంగానే నిబంధించడం గమనింపదగిన విషయం, అంతేగాక పద్యాలల
గాని గద్యంలోగాని నడుమ నడుమ చోటుచేసుకున్న కీర్తనలలోగాని అన
మయ్య పలుకుబడి వానివెనకాల జాలువారే భక్తిభావం భగవత్సేవ-బాగవ
సేవా-దివ్యానుభూతి-ఇలాటి సాత్త్వికోదాత్త గంభీరమైన ఒకానొక పావ
రమణీయ వాతావరణం తుదివరకు పరిమళిస్తూనే ఉంది. చదివే శ్రోత
మనస్సులనూ-నాటకం ప్రదర్శిస్తే చూచే ప్రేక్షకుల చక్షుస్సులనూ ఎంతగా
పరిచరిస్తూనేఉంది. ఇకనేను చెప్పడంకన్నా మీరు చదివిచూడడం మంచి
ఆనారాయణుడే శ్రీ వేంకట నారాయణరాజుకు ప్రతిరోజు సాహిత్య నిబం
నలమీద మోజు సడలకుండా చేయాలని ఈనా తరాజు.



శ్రీ సలదాగు పాండురంగయ్య
రిటైర్డు ప్రిన్సిపాలు,
శ్రీ మలయాళస్వామి ఓరియంటల్ కాలేజి,

ప్రొద్దుటూరు.
6-10-95

# నందకానందం

సాహిత్యంలో చాక్షుషానందానికి పతాక రూపకము. అది దృశ్యమేకాక సంగీతానుబంధంతో నృత్యసహితమైనపుడు ఉత్తమ లలితకళాస్వాదనం రాశి కట్టినట్లే. ఈ అన్నమాచార్యుల నాటకమట్టిది నాయకుడే వాగ్గేయకారుడు కావడం అందుకు అందివచ్చిన, ఒక అనుకూలమైతె. రచయితకూడా వాగ్గేయకారుడే గాక నాటక కళాకారుడుగా నాటకరచయిత కావడం మరొక విశేషం. అంత కంటె నాటక దర్శకుడుకూడా కావడంతో ఈ అన్ని లలితకళలవలని ఆనంద మంతా నందకవిజయంగా బ్రహ్మానంద సహోదరంగా రూపొందింది.

ఆత్మోన్నతిని పంచేవాళ్ళు మహనీయులైతే వాళ్ళపేరే అవతారపురుషులు, అట్టివే ప్రత్యక్ష పరోక్ష మార్గాల్లో పురాణాలలో చెప్పబడినవి లెక్కకు ఇరవై ఒకటి. నిజానికి అనంతకోటి. భావుక సంభావ్యతగా నిరూపింపబడినపుడు కవితాకళకు కలిసిరానిదేముంది, కాగా అన్నమాచార్య చరిత్ర మహేతిహాసమైన చరిత్రకావడం కవి కలానికి కొంత కల్పనావకాశాన్ని ఇచ్చింది, అందు సంభావ్యతనేగాక ఔచితిని ఆవశ్యకాన్ని గుర్తించుకోవడం కవి కళా కర్మయొక్క మర్మం. తెలుగులోని తొలినాదబ్రహ్మ యొక్క భక్తి-సాహితి-సంగీతం అను త్రివేణీ సంగమాన్ని అతని జీవితమనే జీవనదీ ప్రవాహంగా మలచిన అపర భగీరథులు శ్రీ రాజుగారు.

ఇప్పటికున్న రచనాధారాలతో తనకుతోచిన క్రొత్తపొడుగులతో కథను సర్వాంగ సంపూర్ణం, సమగ్రరససుందరంగా పండించినారు. కథా ప్రవృత్తి జానపదుల సంధి సూత్రం మొదలు మహామెరుపుల్లాంటి సూర్యచంద్రులు అయిన అన్నమాచార్య, పురందరులు శేషపర్వతంపై కలుసుకోవడం వరకు శిఖరమెక్కింది-ఇది చారిత్రక సత్యమయినా, సంఘాత విష్ణుని కొంతవరకు కల్పనయైనా, యశోదమ్మగారి కలమాత్రంకాదు. కవిగారి వైష్ణవమాయ కారణం-కవిగారి పేరులో ఒక విష్ణువుగాదు. రూపాంతరాలైన ముగ్గురు మహావిష్ణువులున్నారు. (రామాయణం వేంకట నారాయణరాజుగారు) ఇక ఇందలి అన్న

మాచార్య ద్వితీయపత్ని అక్కమ్మగారి ప్రవేశం కథానిర్మాణ సంకల్పార్థమే గాని వేరుగాదు, సరళభావ పరిమళాలతో పద్యసుమాలు జాలువారినా అన్నమాచార్య కీర్తనామకరందాలు మాత్రం సందర్భఉచితంగా ప్రేక్షకాళికి దివ్యానుభూతిని అందిస్తాయి.

మరొక సువర్ణావకాశం. ఇందుకొన్ని ముఖ్య రంగాలు ముక్తకాంకాలు లేక ఏకాంకికలు కావడం, ప్రయోగానుకూలమే అయింది, కాని నాయకపాత్రధారి మాత్రం కవివలె వాగ్గేయకారుడై యుండాలి, లేక తత్సముడో అయి వుండాలి, తప్పదుమరి.

మొత్తముమీద ఈ రంగ మందిరంలో ప్రేక్షకులకు సర్వకళా సామరస్య సారస్యం, దృశ్యశ్రవణాలకు, సంగీత సాహిత్యాలకు, పామర సంస్కారులకు, రక్తవిరక్తులకు. సాహచర్యానుభూతులకు సమభాగంగా సంతర్పణ జరిగింది. అట్టి రాజుగారి రచన, చదువుటలోగాదు, అది ఆడించి ఆనందించాలి, నాయకుడు రచయిత అంతటివారుగా నటప్రేక్షకులు కావాలి, పదివేల శేషాచలవాసుని, ముప్ఫయివేల అన్నమయ్య కీర్తనలతో అనంతకోటి ప్రేక్షకులు ఉపాసించి తరించాలి.

చివరిమాట, వెంకన్న తెలుగుభక్తులలో రెండవ ఆణిముత్యం తరిగొండ వెంకమాంబ చరిత్ర నాటకంగా రాజుగారిచేత ఇట్లే రంగమెక్కాలని ఆశిస్తున్నాను. భక్తులవలె తచ్చరిత్ర కారులూ ధన్యులే.



**జానమద్ది హనుమచ్ఛాస్త్రి** M.A., B.Ed ,
(ఇంగ్లీషు, తెలుగు) ఇంగ్లీషు లెక్చరర్ (రిటైర్డ్)

కడప.
1-10-95

పదకవితా పితామహుడుగ, సంకీర్తనాచార్యుడుగ ప్రణతులందుకొన్న, వాగ్గేయకారుడు, అన్నమాచార్యుడు ఆంధ్రులకారాధ్యుడు.

ఆ మహనీయుని జీవితమొక అద్భుత కావ్యం, ఆడిందల్లా ఆటగా, పాడిందల్లా పాటగా జనామోదం పొందినవి ఆభక్త శిఖామణి రచించిన కీర్తనలు.

ఈ నాటకము రచించిన శ్రీ ఆర్.వి. నారాయణరాజుగారు వృత్తిరీత్యా ఉపాధ్యాయుడు. నాటకరంగానుభవం కలవాడు, నాటకప్రయోక్త, దర్శకుడు కూడా.

ఈ నాటకము సులభగ్రాహ్యమైన సంభాషణలతో భక్తి, శృంగార, హాస్యరసభరితమై సాగినది. స్వయంగా రచించిన పద్యములు హృద్యంగా ఉన్నవి. అన్నమయ్య కీర్తనలను సందర్భోచితంగా, నాటకమున చేర్చుట, పసిడికి తావి అబ్బినట్లున్నద. నాటకాంతమున అన్నమయ్య, పురందరదాసుల సమాగమము పరస్పరం అభినందనలు, విష్ణుముని ఆశీస్సులందుకొను సన్నివేశము హృదయంగమంగావుంది

ప్రదర్శనానుకూలముగా పవిత్రచరిత్రుడైన శ్రీ అన్నమయ్యగాథను. నాటకంగా రచించిన శ్రీ నారాయణరాజు గారికి నాహార్దికాభివందనములు.



# నా విన్నపం

"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అన్ననుడి ప్రకారం వైకుంఠవాసుని అవతారములలో శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యులుకూడా ఒకరని నామది తలంచితిని

కడప జిల్లా వాసియైన యీ అన్నమాచార్యులవారు 15వ శతాబ్దమువారు. నందకాంశ సంభూతులు, తొలివాగ్గేయకారులు, సంగీత సాహిత్య వేదాంతాల పుట్ట. భక్తి వైరాగ్యాలను సంగమంగామించిన మహనీయులు. కన్నడ పురందర దాసుల సమకాలికులు, కలియుగ వైకుంఠం అతని సంచారం, శ్రీ వెంకటేశ్వరుడే అతని ఆరాధ్యదైవం, శ్రీహరి పాదమే తన పదం, తద్వైభవమే తన పదకవిత, అనిరంతర ధ్యానమే తన పదకవితా గానం. ఆత్రిపుటికి త్రికరణ శుద్ధి లభించింది, జీవన్ముక్తికై శ్రీహరియె అనుక్షణం ప్రత్యక్షంగా ఆత్మ సాక్షాత్కారం. అట్టి మహనీయులు పలికిన పలుకులే కీర్తనలై మనకు భక్తి సోపానాలైనాయి.

ఈ మహనీయుని జీవితాన్ని నాటకంగా వ్రాయాలని ప్రజలకు నాటకాలపై అభిలాష తగ్గిపోతూవున్న ఈ రోజుల్లో తెలిసికూడా తపన. స్వార్థం, పరమార్థం కలిసి వస్తుందని ఇంతకంటె మంచి కథ లేదని, కథ, నటన, సంగీతం సాహిత్యమనే నాలుగంగాలు నిండితే నాటకానికి కావలసిందేముంది, కొదువేముంది అని యీ నాటకం వ్రాయబూనితిని

ఇందుకు తగిన ప్రమాణాలైన చారిత్రాంశములను శ్రీ అన్నమాచార్యుల చరిత్రను శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుగారు, శ్రీ సముద్రాల లక్ష్మయ్యగారు రచించిన వచన చరిత్రలను మరియు శ్రీ అనంత పద్మనాభరావుగారు రచించిన నాటకమును ఆధారంగా సేకరించాను, మూల సూత్రానికి భంగం కలుగకుండా యదోచితంగా కొన్ని కొన్ని మార్పులు చేర్పులు చేకూర్చక తప్పలేదు పాత్రోచితభాష. పద్యాలు, మరి శ్రీ తి. తి. దేవస్థానము శ్రీ అన్నమాచార్యుల ప్రాజెక్టువారి సౌజన్యంతో వెలువడిన కీర్తనలు పొందుపరచితిని. మాటలు, విషయాలు యధామతి సంతరించాను. ముఖ్యంగా నాకున్న కొద్దిపాటి నాటకానుభవం దృష్టిలో నుంచుకొని ప్రదర్శనయోగ్యంగా ఉండాలనే ప్రయత్నించాను.

నా రచనను సరిచూడమని పూజ్యులు శ్రీ బండ్ల రమణయ్య గారికి ఇచ్చితిని. వారెంతో తృప్తిగా చూచిరి. తరువాత శ్రీ సలదాగు పాండురంగయ్య (ఓరియంటల్ కాలేజి ప్రిన్సిపాల్) గారికి చూపితిని వారుఆదరంగా ఆప్యాయతగా నా రచనను చూచిరి, తనకు తోచిన సలహాలను నాకందించిరి, వారికి నా కళాభివందనములు

బహుభాషాకోవిద, సాహిత్య తత్త్వవిశారద శ్రీ యల్లంరాజు శ్రీనివాస రావు గారికి చూపితిని. వారి అభిప్రాయములను తెలియజేయమంటిని. వారు సహృదయంతో ఆభినందించి వ్రాతలో అభినందనకూడా తెలియజేసిరి, వారికి నా హృదయ పూర్వక అభివాదములు.

అట్లే తమ అమూల్య అభిప్రాయము నందిచ్చిన సుప్రసిద్ధ సాహితీ వేత్తలు శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రుల వారికి కృతజ్ఞతలు.

ఈ పుస్తక ముద్రణకు తమ హిందూమత పునరుద్ధరణ కార్యక్రమం లోని భాగంగా అర్ష ధర్మప్రచారపరిషత్తు పుస్తకముద్రణ విభాగ సహాయముగా ఆర్థిక సాయమందిచ్చిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి అనేకానేక హార్దిక కృతజ్ఞతలు.

ఈ దేవస్థాన ఆర్థికసాయ మందుటలో సహకరించిన శ్రీ జూటూరు రమణయ్య గారికి అభివందనములు

మరికొంత విరాళమిచ్చిన నంద్యాల వాస్తవ్యులు. సుజలా పైపులు (Pvt. Ltd,) ప్రొప్రయిటరు శ్రీ S P.Y, రెడ్డి (B E. Mech.) గారికి నా హృదయపూర్వక నమస్సులు.

ఈ పుస్తకము నిట్లు సర్వాంగ సుందరంగా అచ్చు వేయించి యిచ్చిన ప్రొద్దుటూరు శ్రీ వివేకానంద క్లాత్ మార్కెట్‌లోని సిటి ప్రింటర్స్ ప్రొప్రయిటరు గారికి అభివందనములు.

ఈ నా రచన నాటక సమాజములవారికి, నటులకు, సహృదయులకు నచ్చగలదని పురుషోత్తమునికి ఒక పూజా పుష్పంగా సమర్పించుచున్నాను.

**రామాయణం వేంకట నారాయణరాజు,**
ప్రొద్దుటూరు. తేది: 8-10-95

# నందక విజయము లేక శ్రీ అన్నమాచార్య చరిత్ర

అను ఈ పవిత్రమైన నాటక రాజమును శ్రీ వేంకటేశ్వర బాలభారతీ నాట్యమండలి ప్రొద్దుటూరువారు ప్రప్రథమముగా ప్రదర్శనచేయు భాగ్యమును అనుమతించిన రచయిత, దర్శకులు అయిన మా గురువుగారు

## శ్రీ ఆర్.వి. నారాయణరాజు గారికి

మా హృదయపూర్వక కళాభివందనములు

ఇందలి పాత్రలు - పాత్రధారులు

| | |
|---|---|
| వేంకటేశ్వరస్వామి : | జి. జయరామిరెడ్డి (దొరసానిపల్లె) |
| అన్నమాచార్యులు : | ఎ వి. శేషఫణిశర్మ (భాగవతార్) |
| విష్ణుముని (వేంకటేశ్వరుని భక్తుడు) : | డి వి. రామరాజు |
| నరసింహరాయలు (రాజు) . | పి.సి. సుబ్బరాయుడు (దొరసానిపల్లె) |
| నరసింహరాయలు మంత్రి : | బి. సుబ్బారావు |
| పురందరదాసు (పాండురంగని భక్తుడు) . | హూలం బాలరాజు |
| పెద్దవెంకయ్య : | జి జయరామిరెడ్డి (టౌన్‌బ్యాంక్) |
| కేశవయ్య . | జి సి. కేశవాచారి |
| లింగమయ్య : | వి. సుబ్రమణ్యాచారి |
| సూరి (తిరుపతి యాత్రికుడు) : | వంగనూరు గురప్పసాగర్ |
| హరిదాసు (వేంకటేశ్వర భక్తుడు) : | ఆర్ బి. జయదేవవర్మ |
| పురుషుడు (వేంకటేశ్వరుని మారువేషం) | కె నాగేశ్వరరావు |
| బ్రాహ్మణుడు (వేంకటేశ్వరుని మారువేషం) | కె నాగేశ్వరరావు |
| చిన్న అన్నమయ్య . | ఆర్. పూర్ణచంద్రవర్మ (10 సం॥ల బాలుడు) |
| చిన్న వెంకయ్య : | ఆర్. తేజస్వరూపవర్మ (10 సం॥ల బాలుడు) |

-: స్త్రీలు :-

| | |
|---|---|
| అలిమేలుమంగమ్మ : | శ్రీమతి అరుణకుమారి (నంద్యాల) |
| లక్కమాంబ (అన్నమయ్య తల్లి) : | కె. పద్మనాభరెడ్డి |
| తిరుమలాంబ (అన్నమయ్య మొదటి భార్య) : | శ్రీమతి ఆర్. నిర్మాలాదేవి (నంద్యాల) |
| అక్కమాంబ (అన్నమయ్య రెండవ భార్య) : | శ్రీమతి ఆర్. నిర్మాలాదేవి (నంద్యాల) |
| ముక్క (తిరుమల యాత్రికురాలు) : | శ్రీమతి సరోజాదేవి, నంద్యాల |

# నందక విజయము

## (అన్నమాచార్య చరిత్ర)

మొదటి సీను

[అలిమేలు మంగమ్మ ధ్యానంలో ఉంటుంది తెరలో శాంతాకారం శ్లోకం వినపడుతూ వుంటుంది తెరతెరువబడుతుంది] (తెరలో)

శ్లో॥ శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం
లక్ష్మీకాంతం కమలనయనమ్ యోగిహృద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం

అలి : (కళ్ళు మూసికొని ధ్యానంలోనుండును)

వేంక: (ప్రవేశించి) (చిరునగవున సమీపించి)

శ్రీదేవీ! నిను గొల్చి యీయిలను నీచే దీవెనల్ పొందగా,
నేదీనుం డెట దీక్షలో నిలిచెనో? యే యార్తి దానుండెనో?
యీ దీనుండిటు నీదు ప్రేమకును, చేయింజాచి యర్థించెనే
లేదాయెన్ గద యోర్పు నాకు సఖియా లేశంబునున్! ప్రోవవే.

(పరికించి) ప్రేయసీ! ఎవరికై ఈ ధ్యానము?

అలి : (కళ్ళువిప్పి) ప్రభూ! ఈ అలిమేలుమంగ ఎవరిని గురించి ధ్యానించును?

వేంక: నాకు తెలుసు. ఏభక్తుడో నిన్ను తలచుకొని వుంటాడు!

అలి : స్వామీ! మీరు భక్తులపాలిటి కల్పతరువని బిరుదము బొందిన దేవులు (ఆలోచించి) కాని

వేంక: కాని, ఊఁ సందేహమేల? వచింపుము-

అలి : ప్రక్కన అందాల రాణిని ఉంచుకున్నావు గదా? ఇక ఆమెతో ముచ్చట, ఆముచ్చటలో భక్తుల పిలుపు-తమకు - - -

వేంక: నీఆడబుద్ధి పోనిచ్చిన దానవు కావు, ఇప్పుడు నీవు నీమనసున నన్ను తలచితివా? ఇంకనూ నీతలపు పూర్తి కాలేదు! నీముందు నిలచితిని అటు కాదులే! ప్రక్కన నిలిచి నీకొంగు పట్టుకొని వుండాలనినీకోరిక. సరియె! ఉందామనుకుంటెభీష్మించి నాకుదూరముగా వచ్చి నిలచిన మహాలక్ష్మివి. కాని, యిపుడు నీకేమి తక్కువని యీ నిష్టూర వాక్యములు? ఎల్లవేళల నీదావుననే ఉందును-అంతియేగా!

అలి : స్వామీ! యీ నయగారపు పలుకులు తరువాత, తమరు యిప్పుడు ఇక్కడ వచ్చిన కారణమేమో?

వేంక: (నవ్వి) బావుంది. తమరెందుకు నన్ను ధ్యానించారో? అందుకే!

అలి : అది మీపురుషుల నైజము-ఎటుపోతుంది?

వేంక: నిజము-మానైజము ఎటుపోతుంది? అర్ధాంగుల ననుసరించి నడచుకోవడం-అదియునుగాక ప్రపంచమున స్త్రీమూర్తిని ప్రేమించినట్లు ప్రకృతిలో మరెవ్వరిని, ఏవస్తువులను సైతము ఎవ్వరును ప్రేమించరు

అలి : ఎందుకో?

వేంక: ఎందుకా! (కౌగిలించుకొని, ముద్దుపెట్టుకొనబోవును.)

అలి : ఆగండి! ఇందుకా? (కౌగిలి నుండి దూరముగా పోవును)

వేంక: అలివేలూ! నీకు తెలియదా?

విదియును స్త్రీని నందముగ వేడుకతోడుత సృష్టిసేసె, న
య్యది ప్రకృతిన్ జెలంగు సొబగంతయు ప్రోగొనరించుటే గదా,
కదలిన నాడినన్ గనుల గాంచిన లోకము ముగ్ధమౌట యా
మదనుడు సర్వులన్ మరుల మత్తున ముంచును స్త్రీని గాంచినన్

కావున ప్రకృతిలో స్త్రీని మించిన అందము మరి ఎక్కడనూ లేదు, పైగా స్త్రీ శక్తి స్వరూపిణి, ఆ శక్తికి ప్రపంచ మంతయు వశమైపోవలసిందె! అట్టి శక్తిని ఆరాధించి, ఆనందమున నోలలాడించు పురుషుడు ఎంత శక్తిమంతుడో ఆలోచించు.

అలి : (ముచ్చటగా సమీపించి) ప్రభూ! మీమాటల చతురత చాలా శ్లాఘనీయము. మీరన్నమాట నిజము. ప్రపంచమున స్త్రీశక్తి గొప్పది, కాని శక్తి స్వరూపిణిని తాము సృష్టించి ఆసృష్టినే ప్రేమించటం చాలావిచిత్రం

వేంక: దేవీ! అది సృష్టినైజము, అటు ఒకరినొకరు ప్రేమించకున్న సృష్టి నశించిపోవును

అలి: అవును, ఒకరి నొకరు ప్రేమించడం సృష్టినైజమని అంటున్నారే కాని మీరు సృష్టిని ప్రేమించడం లేదని నేతలంతును

వేంక: మంగా! నాగురించి ఎప్పుడూ నీతలంపు అంతే!

అలి: స్వామీ! నన్ను గురించి కూడా! మీతలంపు అంతేగా!

వేంక: అలిమేలూ! నీవేదో నర్మగర్భితముగా మాట్లాడుచున్నావు.

అలి: మీరు బహుబార్యాలోలురై సంచరించుటచే నావాక్యములు మీకు నర్మ గర్భితముగానె తోచుచుండును

వేంక: అలిమేలుమంగా! నీవు నన్ను ధ్యానించడం నేనురావడం ఇదినేరమా?

అలి: స్వామీ! నేను మిమ్మ ధ్యానించడం మీకు వినిపించింది కాని భక్తుల మొరలు అవేదనలు, మీకు వినిపించవా? మీరు సర్వాంతర్యాములు కారా?

వేంక: (ఆలోచనగా) దేవీ! ఇప్పుడు నీవడుగుచున్నది. తాళ్ళపాక అన్నమయ్యను గురించేనా?

అలి: అవును-

ముసు నారాయణసూరి లక్కమయు మిమ్ముఁన్ గొల్వగా వారికిన్
తన ఖడ్గంబగు నందకాంశమున నుత్పన్నుండు నాబాలుడే
నిను ప్రార్థించెను అన్నమయ్య వినవో నీకేల విన్పింపదో
చను! వేవేగమె తాళ్ళపాకకును నా స్వామీ! మిమున్ గొరెదన్

వేంక: (చిరునగవున) నన్నేకాదు. నిన్నుకూడా! ఆ బాలుడు ధ్యానించు చున్నాడు

అలి: స్వామీ! నిన్ను నన్ను అను భేదమేల? ముందాబాలుని అటునుంచి కదిలించాలి, అతడు కారణ జన్ముడు తానెంతో లోకోపకారి-భక్తియను నది యీయుగమున అతని మూలముననే ప్రచారము కావలయును కావున మన మాభక్తుని దర్శించి తగిన సాయము చేయాలి

ేంక: మంగా! నీవు ఆజ్ఞచేయుటయు; నేను అంగీకరించకుండుటయునా? ఇర్వురము కలిసియే వెళ్ళుదము పదా?

అలి : సంతోషము

(ఇర్వురు నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)

రెండవసీను

(బయలుప్రదేశం, పైరుగల చేనిలో)

అన్న : (తెగిన ఎడమచేతి చిటికెనవ్రేలును పట్టుకొని రక్తం కార్చుకుంటు బాధతో ప్రవేశం) అబ్బా! ఎంతబాధ! ఎంతరక్తం కారిపోతూందో, ఏడు కొండలవాడా! తల్లీ! అలిమేలుమంగమ్మా! మీదాసునిపై కరుణలేదా! (బాధగాకూర్చొనును)

వేంక: వరే! అన్నమయ్యా! అన్నమయ్యా! (తెరలోనుంచి పిలుచుచు ప్రవేశించి) పశువులకు మేతకోయకుండా అదేమిటిరా! ఇక్కడ కూర్చున్నావు? (సమీపించి వ్రేలికి కారుచున్న రక్తం చూచి) అయ్యో! ఏమిటీరక్తం, ఏమి జరిగిందిరా! (అన్నమయ్య చేతివ్రేలిని చూస్తూ దగ్గరగా కూర్చొనును)

అన్న : (బాధగా) ఏమి జరిగింది కొడవలితో గడ్డిని కోస్తూ, వ్రేలినికూడా కోసుకున్నాను, అబ్బా! అబ్బా! (బాధపడును)

వేంక. వరే! "చిత్తం శివునిమీద భక్తి పరులమీద" అన్నట్లు, నీవేదో ఆలోచిస్తూ వళ్ళు తెలియక ప్రవర్తించినందుకు తగిన శిక్ష అనుభవిస్తున్నావు (తలకు చుట్టుకొన్న పంచను తీసి చింపి వ్రేలునకు కట్టుకడుతూ) ఎంత రక్తం కారి పోయిందో యేమో బాగా తెంచుకున్నావు

అన్న : అవును బాగా తెంచుకున్నాను.

వేంక: వరే! పనిచేసే వేళలో పరధ్యాన మేమిటిరా? నీ పరధ్యాన మేమిటో పూర్తి చేసికొని పనిచేయరా! నీ పద్ధతి నాకేమీ బోధపడదు-

అన్న : నాపద్ధతి ఎవరికీ బోధపడదు, అయినా యీనాడు లేచిన వేళేమిటో అన్నీ అట్లే జరుగుతున్నాయి పొద్దున్నే ఎవరి ముఖం చూశానో - -

వెంక, ఎవరిముఖం చూడనక్కరలేదు. నీకు చిత్తం సరిగ్గా ఉండక యీపని చేసుకున్నావు



అన్న : అబ్బా! ఎంత బాధ, ఎంత రక్తం కారిపోతూందో ఏడుకొండలవాడా, తల్లీ! అలిమేలు మంగమ్మా! మీ దాసునిపై కరుణలేదా.

వేంక : వరే అన్నమయ్యా. అన్నమయ్యా: పశువులకు మేత కోయకుండా! అదేమిరా! ఇక్కడ కూర్చున్నావు. అయ్యో ఏమిటీ రక్తం - ఏమి జరిగిందిరా.

అన్న : అవునురా! నీవన్నమాట నిజమె చిత్తం సరిలేకనే రాత్రంతా జాగరణచేసి తెల్లవారు జామున నిద్రపోయాను. మాఇంటి ప్రక్కనున్న బసవయ్య మామగారు తిరుపతికి వెళ్ళిపోయాడు. ఇప్పుడు వ్రేలు తెంచుకున్నాను, అంతా అయోమయంగా ఉంది

వెంక అయోమయమేమిటి? వారు తిరుపతికి వెళితే నీకెందుకురా బాధ? నీకూ తిరుపతికి వెళ్ళాలని బుద్ధివుంటె పోకూడదూ?

అన్న వెళ్ళాలనే కోరిక, ఎన్నో యేళ్ళుగా నన్ను పట్టి పీడిస్తూనే వుంది

వెంక· మరి వెళ్ళకూడదూ?

అన్న : బసవయ్య మామగారినేమో అడిగాను "నేనూవస్తాను మామయ్యా" అని ఆయనేమొ "వస్తువులేవోయ్" అన్నాడు. ఆయన భార్య పార్వతమ్మ అత్తగారేమో "అల్లుడూ! మీఅమ్మను నాన్నను అడిగావా నాయనా" అంది. "లేదత్తయ్యా!" అన్నాను! "అమ్మో! నాయనోయ్ మేము నిన్ను తిరుపతికి తీసుకెలితె మీఅమ్మ నాన్న వదినె, మమ్ము యీవూళ్లో బ్రతుకనిస్తారా!" అంది పైగా యింట్లోని చాకిరి ఎవరు చేస్తారు? అందుకై నీవు మావెంట రావద్దు తండ్రీ!" అన్నారు. కాని నేను మాత్రం। ఎలాగైనా వారివెంట వెళ్లాలని తెల్లవారేదాక వారింటికి కావలి కూర్చు న్నాను. తెల్లవారుజామున నాకు తెలియకుండానే నిద్దుర వచ్చింది, తెల్లవారి లేచి చూచే సరికి వారులేరు. అదేబాధ-

వెంక· ఒరే! అన్నమయ్యా! నాకు తెలియక అడుగుతాను-బండంత చాకిరి ఇంట్లో పెట్టుకొని నీవు తిరుపతికి వెళితె! యీచాకిరి ఎవరు చేస్తారూ? చెప్పు? అమ్మా! నాన్నా! చూస్తామా: ముసలి వాళ్ళయి పోయారు, ఇక అన్నగారంటె పైపనులు చూసుకోవాలి, ఇక వదినెగారంటె, ఇంట్లో వంటలు వార్పులు చూసుకోవాలి ఆలోచించుకో నీవే

అన్న (నిట్టూర్చి) అవునురా! వెంకయ్యా! నీవు చెప్పేది చాలా బాగుంది. కాని నాకు చదువు సంధ్యలు సరిగా రాకపోయె. తుదకు కేశవనామాలుకూడా సరిగా రాకపోయె బ్రాహ్మణ కులములో పుట్టి చదువురాని వెధవ నై పోయాను. ఎప్పుడూ పొలము గొడ్లు, ఇల్లు - - ఇట్టి నాకు తిరుపతికెళ్ళి ఆ వేంకటేశ్వరుని చూచే భాగ్యంకూడా లేకపోయింది; వేంకటేశ్వరా! నా అవేదన నీకు నేనెట్లు తెలియజేయాలో నాకు తెలిసిరావడం లేదు స్వామీ! ప్రాణాలుండగా నేమిమ్ము చూడగలుగుతానో లేదో

వేంక: ఒరే! అన్నమయ్యా! నాకు తెలియకడుగుతాను అంతా నీవెర్రిగాని, ఆ స్వామిని చూడకపోతె వచ్చిన నష్టమేముందిరా? అంత బాధపడతావు?

అన్న: ఆ తిరుపతి దేవుడు మా ఇంటి దేవుడురా! పైగా నాకు ఆ దేవుడంటె యెంతో యిష్టం

వేంక: ఈ పిచ్చి ఆలోచనలన్నీ వదలి పదా. నేను గడ్డి కోసిపెడతాను-తీసికొని వత్తువు. ఆనోరులేని గొడ్లు పాపం పస్తుపడుకొంటాయి, వాటిపాపం మనకెందుకు (లేచును)

అన్న. అవును వెంకయ్యా! నా బాధతో నేనిటే వుంటె ఆ నోరు లేని పశువుల పాపం నాకే, పదా వెళుదాము. (లేచును)

వేంక: (ముందు నిష్క్రమించును)

అన్న: (పోబోవు చుండును)

(తెరలో పాట వినిపించును)

పాట

గోవిందా - గోవిందా గోవిందయంచని
గొంతెత్తి పాడవె ఓమనసా
గోవిందాయని నీమదితలచిన
కోరికలెల్ల తీరును మనసా ॥ గో॥

(మారువేషముల అలిమేలు మంగమ్మ, వేంకటేశ్వరులు ప్రవేశం)

స్త్రీ: గోవిందా! గోవిందా - గోవింద

పు. ఏడుకొండలవాడా - గోవిందా గోవింద

అన్న: (ఆశ్చర్యముతో చేతులు జోటించి నిలిచి వారు వచ్చే వైపు చూస్తూ వుండును)

పు: యే వేంకటరమణా!

స్త్రీ: గోవిందా! గోవింద

పు: ఆపద మొక్కులవాడా!

స్త్రీ: గోవిందా! గోవింద

పు: అడుగడుగు దండాలవాడా!

స్త్రీ: గోవిందా! గోవింద

అన్న అయ్యా! నమస్కారము మీరెక్కడికి వెళ్ళుతున్నారు?

పు. నాయనా! తిరుపతి వేంకటేశ్వరుని కొండకు వెళ్ళుచున్నాము

అన్న· (ఆనందమున చేతులు జోడించి) అయ్యా! మీరెంత పుణ్యాత్ములు

స్త్రీ కుమారా! తిరుపతికొండ కెళ్ళువారందరూ, పుణ్యాత్ములే

అన్న· తల్లీ! ఆ తిరుమలవాసుని మీరింతకు మునుపు చూచియుంటిరా?

పు నాయనా! మేము ఆస్వామిని నిత్యము స్మరణ చేయుచుందుము, అందుచే ఆ వేంకటేశ్వరులు, అలిమేలుమంగమ్మా, నిత్యమూ మాకు కనిపిస్తూనే వుంటారు

అన్న· స్వామీ! మీరెంత ధన్యులు! మాపోటివారికి ఆభాగ్యమెట్లుగలుగును?

స్త్రీ . కుమారా! నీకంత కోరికయున్న, ఒకమారు తిరుపతివెళ్ళి, ఆ శ్రీవేంకటేశ్వరుని, అలిమేలు మంగమ్మను, దర్శించి రమ్ము

అన్న. తల్లీ! ఎంతమాట, ఎంతమాట! ఇంటిలో ముసలి తల్లి దండ్రులు, అన్న వదినెలు నేను లేకపోయిన ఇంటిలోని పనులు ఎక్కడివక్కడె ఆగిపోవును అందుకై ఎన్నోఏళ్ళగా శ్రీ వేంకటేశ్వరులను, అలిమేలుమంగమ్మను, చూడవలె ననెడి కోరిక దినదినమునాలో పుట్టి చచ్చుచున్నది, తల్లీ! యిక యీజీవితమున కింతే! కాని! ఏదో ఆ శ్రీనివాసుని కృప నాపై కలిగితే. చెప్పలేను.

పు కుమారా! జీవితాంతము, స్వామిని చూడవలెనన్న కోర్కెతో ఎట్లు నిలువగలవు? ప్రతివారును. ఇల్లు, వాకిలి తల్లిదండ్రులు, అన్నవదినెలు లేకయుండరు! నీకు స్వామికంటె, ఇల్లువాకిలి, తల్లిదండ్రులు, అన్నవదినెలే, ఎక్కువయిన, ఇక దైవచింత మాని నిశ్చింతగా నీపనులపై నీవు జాగరూకుడవై యుండుము, మేము, నితో కాలము గడువుటకు రాలేదు. మా ఏడుకొండల వేంకటరమణుని చూచి ఆనందింప బోవుచున్నాము నాయనా! పోయివత్తుము

అన్న· (నిస్పృహతో) అయ్యా! తమరు తిరుపతికి ఎన్నిదినాలకు వెళ్ళగలరు

పు · కుమారా! భిక్షకులము యిష్టము వచ్చినచోట ఆగుతూ వెళుతుంటాము (పరికించి) నాయనా! యేల చింతాక్రాంతుడవై యుంటివి?

అన్న: స్వామీ! ఏమని తెల్పుదును! ఒక్కతూరైనా! ఆ వేంకటేశ్వరుని అలిమేలుమంగమ్మను చూడాలని, అన్న మమకారం నన్ను ఒక్కచోట నిలువ నీయకున్నది.

స్త్రీ : పుత్రకా! ఆ మమకారాన్ని చంపుకోకు; స్వామిని దర్శించిన నీమనో బాధలు పోవును; కావున త్వరగా యీ బందాలను తెంచుకొని, తిరుపతి దేవుని దర్శించుటకు ప్రయత్నించు. వస్తాము నాయనా! ఏడుకొండల వాడా! గోవిందా, గోవింద

పు<br>స్త్రీ } (నిష్క్రమింతురు)

పు : (తెరలో) వడ్డికాసులవాడా!

స్త్రీ : (తెరలో) గోవిందా! గోవింద

పు : (తెరలో) ఆపద మొక్కులవాడా

స్త్రీ : (తెరలో) గోవిందా! గోవింద

అన్న: (నిశ్చేష్టుడై వారు వెళ్ళిన వైపు చూచుచుండును) (నిట్టూర్చి) అవును బసవయ్య మామగారు, పార్వతమ్మ అత్తగారు, తిరుపతికి యింతకు మునుపే వెళ్ళారుగదా! నేనూ, వారవెంట వెళ్ళాలి అనుకున్నాను - - - మనసులో మమకారాన్ని చంపుకోలేను, ఏమి చేయాలి (ఆలోచించి) ఏనాడో ఒకనాడు, ఇంటిపైనున్న మమకారాన్ని విడిచి, స్వామిని చూడను వెళ్ళాలి? యీ నాడే అపని చేస్తే? పైగా బసవయ్య మామగారు తోడుగా వుంటారు. త్వరగా వెలితే? (మౌనముగా ఆలోచన జేసి) ఇదే నా నిశ్చయం! ఇదే మంచి సమయం. ఆలస్యం చేసితినా? బసవయ్య మామగారు దూరమైపోతారు, నేను వంటరివాడనై పోతాను వెంకటేశ్వరా, ఏడుకొండలవాడా! గోవిందా! గోవింద (చేతులు జోడించి నిష్క్రమించును) (తెరవ్రాలును)





వేంక : పాపం అన్నమయ్య, నాపై భక్తిచే ఇల్లు వదలి నన్ను చూడ పయనమై ఈ అరణ్యమున, భీతచేతస్కుడై నడువ లేక, నడచుచున్నాడు, ఈతనికి బ్రాహ్మణ వేషమున కొంతతోడుగానుండి ఈ అరణ్యమునుదాటెంతునుగాక.

# మూడవ సీను

(అరణ్యము)

అన్న: (ప్రవేశము) ఇదేమిటి? ఎంత నడిచినా బసవయ్య మామగారు కనిపించడం లేదు, మార్గమున ప్రయాణీకు లెవ్వరూ, ఎదురగుట లేదు, ఈ అరణ్యం చాలా భయంకరంగా కనిపిస్తున్నది, ఈ అడవి ఇంకా ఎంత దూరమో! తెలియదు. (నిట్టూర్చి) వేంకటేశ్వరా! ఇంత భయంకరమైన అడవిలో నీ కొండకు దారికలదని, నాకు తెలియదు; స్వామీ! అడుగడుగునకు భయము, అందుచే ముందునకు నడువలేక పోతున్నాను (దిక్కులుజూచి భయముఁ న)

శ్రీ రమణీశ, నిన్నుగన చింతయు గల్గిటు వచ్చినాడ; ఈ
ఘోరవనిన్ భయంబునగు, క్రూరమృగంబుల బారి తప్పి నే
చేరుదు నెట్లు? నీకడకు చింతిలి యిప్పుడు లాభమేమి? నే
నేరక చేసితింతపని; నీవె యికన్ నను బ్రోవు మయ్యరో!

స్వామీ! వేంకటరమణా. ఏడుకొండలపైనున్న దేవా! ఇంక నేనెటు పోవాలో తెలియకున్నది (భయమున దిక్కులు చూచుకుంటూ నిష్క్రమించును)

వేంక: (ప్రవేశించి) పాపం అన్నమయ్య, నాపై భక్తిచే ఇల్లు వదలి నన్ను చూడ పయనమై ఈ అరణ్యమున భీతచేతస్కుడై, నడువలేక నడచుచున్నాడు. ఈతనికి బ్రాహ్మణ వేషమున కొంత తోడుగానుండి ఈ అరణ్యమును దాటింతునుగాక (నిష్క్రమించును)

అన్న: (భయమున దిక్కులు చూచుకుంటు ప్రవేశము) ముందునకు నడువ ధైర్యము చాలకున్నదే? వేంకటేశ్వరా! (వెనుకకు తిరిగి చూచును) అమ్మయ్యా! ఎవరో వచ్చుచున్నారు కొంత భయము తీరినది

బ్రా: (ప్రవేశము)

అన్న: (ఆనందమున) స్వామీ! నమస్కారము

బ్రా: దీర్ఘాయుష్మాన్భవ! కుమారా! చిన్నవాడవు ఈ భయంకరాటవిని ఒంటరిగా, ఎక్కడకు వెళ్ళుచున్నావయ్యా!

అన్న: స్వామీ! తిరుమలేశుని దర్శింప కోరిక గలిగి బయలుదేరితిని కాని దారి యింత భయంకరముగా నుండునని, నాకు ముందు తెలిసినది కాదు,

సూరి: (విరగబడి నవ్వి) వరె వరె వరె? నీల్లు పోసుకోవడమంటె, గరబవతన్న మాట, సుక్కె యీ మాట నాకు ముందే సెప్పింటె, యీ పాటికి మనం కొండకి యెన్నితూల్లు యెల్లివుండేవాల్లమో! సరే లే! నడూ! (లేవబోతూ) అమా! అమా! (లేవబోయి కూలబడును)

చుక్క: (చేయి పట్టుకొని లేపును)

♦ పాట ♦

లెగు లెగు నాసోమె ఓమామ సూరి
యింకన్న కొండనెక్కి వత్తాము పదసామె ॥లె॥
పిల్ల లిత్తాడంట పియముతో మొక్కుంటె
తలనీలా లిత్తేను తల్లు లౌతారంట
బంగారు కోనేట్లో బత్తితో మునిగితేను
బంగారంలాంటి బిడ్డ మనకే పుడ్తాడురో ॥లె॥

సూరి: (బాదగా) కొండ నెక్కలేను,
అమ! అమ!
కొడుకేమొ కావాలి
సుక్కే సుక్కే (లేవబోతూ)
అండగానూ వుంటె కొండా నెక్కుతానె
ఓసోమే ఓసోమే (చేయిచాపుతూ)
యీ కొండపై నీవు ఎందుకుండావయ్యా

చుక్క: (బలవంతాన చేయి పట్టుకొని లేపును)

సూరి: ఉండుండు లాగాకె ఉడుదుడుకు సేయాకు.
గోవిందా! గోవింద (లేచును)

చుక్క: అద్దిరా! నాసామి; సామినే తల్చుకోర
గోవింద అంటేను గొప్పబల మొత్తాది
ఓసామె నీపేల్లు యెన్నో వుండాయంట
యేడు కొండలసామి యెరుగమే ఆ పేల్లు
మాకూ రావూ సోమె గోవిందా! అంటాము ॥లే॥
గోవిందా! అను

సూరి: అంటున్నా: గోవిందా! గోవింద (ఇరువురు నిష్క్రమింతురు) (లైటాఫ్)
(కొండలసీను వేయాలి) (లైటాన్)

అన్న: (ప్రవేశించి) అబ్బా! యీ మహనీయుని నెలవు యింకా ఎంత దూరమో? ఎంత నడచినా స్వామిని సమీపింపలేక పోవుచున్నాను? నడచి నడచి నాశక్తి సన్నగిల్లినది. (ప్రయాసగా) స్వామీ! యిక నేనడువలేను (మెల్లగాకూర్చుంటూ) ఏడుకొండలవాడా, నీకొండ నెక్కుటకు నాకు శక్తిని ప్రసాదించు దేవా, శక్తిని ప్రసాదించు, (నిట్టూర్చి కొంతసేపు వుండి మెల్లగలేచి నిలిచి)

* పాట *

దేవా!

ఇక ఎంత దూరమో నీగమ్య మయ్యా
నేనడువ లేనయ్య అలసీ పోతీనయ్యా - ఇక॥
కొండలెన్నో దాటి మండుటెండాలోన
అండాఆపూ లేక తిండితీర్థము లేక
మొండినయ్యా నేను ఎండునాల్కా తోటి
కొండలరాయా నీ అండా చేరగలేను ఇక॥
గగనాన ఉన్నట్టి గరుడాద్రిపైన
గరుడవాహన నీ గమ్య మున్నాదయ్యా
ఆయాస మధికమై అడుగు నడువాలేను
అమ్మ! అలిమేలమ్మ ఆదరించుము తల్లి ఇక॥
కన్నుల మైకము క్రమ్మెనమ్మా నాకు
కానరావూ కనులు కదల లేనమ్మా
కాపాడు మాయమ్మ కరుణతో మంగమ్మ
నీపాదముల నే నమ్మి వచ్చితినమ్మా, ఇక॥

(ఆయాసతో) స్వామీ! వేంకటేశ్వరా? ఏమిటీ పరీక్ష (మెల్లగ కూర్చుంటూ) నా శరీరము క్షణ క్షణమునకు బరువై మోయలేక పోతున్నాను, వేంకటరమణా! అలిమేలుమంగమ్మా! (మెల్లగ పండు కొనును)

అలి : (ప్రవేశించును) అయ్యో! యీ బాలుడు బాగా అలసి మూర్ఛిలిపోయి నాడు, పాపం! ప్రయాణ మైనది మొదటినుంచి ఇంతవరకు నిద్రలేదు; ఆహారములేదు; పచ్చి మంచినీరుకూడా ముట్టలేదు; ఏమి! ఈతని దీక్ష.

ముసలి వేషమున యీతనికి సేదతీర్చెదను

(లైటాఫ్)

(అలిమేలుమంగ నిష్క్రమించి ముసలవ్వ వేషమున నీటిచెంబు, తంబుర, కాళ్ళగజ్జెయులు, చిటికెలు మకుటముతో ప్రవేశించును )

అవ్వ (అన్నమయ్య వద్ద కూర్చునీ, అన్నమయ్య తలను తన ఒడిలో యుంచుకొని, నీళ్ళతో ముఖము తుడిచి తనపైటతో ముఖము తుడుచును)

అన్న (మెల్లగ కన్నులు విప్పి చూచి) ఇప్పుడు నేనెక్కడ నున్నాను?

అవ్వ నావొడిలో కుమారా! కొంచెము, నీరు త్రాగు, నాయనా! (నీళ్లు త్రాపును)

అన్న. (నీరు త్రాగి మెల్లగ లేచి కూర్చుని పరికించి) అమ్మా! మీరెవరో! పూజ్యురాలవుగా నున్నావు! అలసిపోయిన నన్ను ఆప్యాయతగా తమ ఒడిలో ఉంచుకొని, సేదతీర్చిన తల్లివి! నీచేతి నీళ్లు నా కిప్పుడు అమృతము తల్లీ! కానీ, నీ మూలమున నాదీక్ష భగ్నమైపోయినది (చెంపను వేయియుంచుకొనును)

అవ్వ· (ఆశ్చర్యమున) దీక్షా! ఏమిటాదీక్ష? నాయనా!

అన్న: స్వామిని దర్శించువరకు ఏ ఆహారముగాని పానీయముగాని పుచ్చుకొన కూడదని శపథము పూనితిని మతిలేక నీచేతి మంచినీరు త్రాగితిని. నా దీక్ష నీచేతి నీటిలో కలిసిపోయినది. అయినా, నా దీక్ష తమకేమి తెలుసు. కరుణామయురాలవు కనుక నీరును నా గొంతులో బోసి స్వామికొండ నెక్కుటకు శక్తిని ప్రసాదించినావు, నీకు నానమస్కారము తల్లి (నమస్కరించును)

అవ్వ: కుమారా! స్వామి కొండ నెక్క శక్తినే గాదు, నీకు సర్వ శక్తులు అనుకూలించును

అన్న· అమ్మా! ఇంత మంచి అవ్వవు, నీ వెవ్వరవో నేనడుగనేలేదు, ఈనిర్జన ప్రదేశములో ఎందుకుంటివో? తెల్పగలవా తల్లీ!

అవ్వ· ఇక్కడనే సమీపమున నా నివాసము, చిన్నపల్లె కుమారా!

అన్న: మీరు స్వామిని దర్శింప వచ్చుచుంటిరా?

అవ్వ: వెర్రివాడా! భక్తులకొరకు భగవంతుడే వచ్చును. కాని భక్తులు భగవంతుని కొరకు పోవడమేమిటి?

అన్న: (ఆశ్చర్యమునొందుచూ) ఏమంటున్నారు? భక్తులకొరకు భగవంతుడే! వారి దాపునకు వచ్చునా? అమ్మా! మీరెంత పుణ్యవతులు? మీ

రెవ్వరో? చాలా గట్టివారె

అవ్వ (నవ్వి) నిజము నాయనా! నాకొరకే, ఆ వెంకటరమణుడు నా వద్దకే అప్పుడప్పుడు వచ్చుచుండును.

అన్న: అమ్మా! మంచిది, ఇక నాకు సెలవు దయసేయుము. మీమేలు మరువను తల్లీ! నమస్కారము (లేచిపోవును)

అవ్వ ఆగు! నాయనా స్వామిని దర్శించి తిరిగి ఎప్పుడురాగలవు?

అన్న ఇల్లు వదలినప్పుడు తిరిగి ఇల్లు చేరు నుద్దేశ్యమున బయలు దేరలేదు, అందరిని వదలి స్వామి సన్నిధి చేరదలచితిని.

అవ్వ (లేచి) అయ్యది నీకు సాధ్యమా? నాయనా?

అన్న: ఆ తల్లిదండ్రుల దయ నాపై నున్న నాకే కొరతయుండదు

అవ్వ సంతోషము, నీకోర్కె సిద్ధించును వెళ్ళిరమ్ము।

అన్న. తల్లీ! నీదీవెన నాకు తృప్తిగాలేదు

అవ్వ· ఎందులకయ్యా!

అన్న. నేను స్వామి సన్నిదిలోనే ఉండదలచితిని, కాని, మీరు తిరిగి రమ్మని నన్నాశీర్వదించితిరి.

అవ్వ· (నవ్వి) నాయనా! నీదీక్ష మెచ్చదగినది.

అన్న· అవ్వా! మీరు నాకై ఇంత ఓపికతో, ఆదరించి, యేదేదో చెప్పుచున్నారు, ఇదిచూడ మనకేదో ఒక అపూర్వానుబంధముండియుండు నను కుంటాను.

అవ్వ కావచ్చు, నాయనా. లేకున్న నిన్నింత ఆదరణతో నేనెందుకు చూస్తాను. ముందేకాదు, ఇక ముందుకూడా నీవు మాకు దగ్గరివాడవౌతావు, మరొక మాట, పాదరక్షలు ధరించి ఏడుకొండలవాని కొండ నెక్కరాదు, ఇక్కడే వదలి పొమ్ము, యీ గజ్జలు కట్టుకొని, తంబుర వాయించుతు చిటికెలు ధరించి, యీ మకుటము తలపై యుంచుకొని స్వామివద్దకు నడువుము. నీవు ఏ ప్రయాసలేక, స్వామి సన్నిధి చేరగలవు. (గజ్జియలు-తంబుర, చిటికెలు మకుటమునిచ్చును)

అన్న. (తీసికొని కళ్ళకద్దుకొని) తల్లీ! తమ యాజ్ఞానుసారమే గావింతును (పాదముల ముందు కూర్చుని నమస్కరించును)

అవ్వ: నాయనా! నీకోర్కె ఫలించును. (తలపై చేయియుంచును)

(లైటాఫ్)

అవ్వ: (మాయమగును)

(లైటాన్)

అన్న: (లేచి దిక్కులు చూచి ఆశ్చర్యమున) అదేమి? క్షణములో అవ్వ కనిపింపదు ఎటుబోయెను? (లేచి వెదకి) ఈమె ఎవరైయుండ వచ్చును? (ఆలోచనగా)

కలయా? మాయయ? నిక్కమా, అనృతమా? కన్పింప దీతల్లియా,
అలిమేలమ్మయె, నన్ను గాచుటకునై, ఆహా! యిటుల్ చేరి నా
తలిదండ్రిన్ మరపించె, యాదరమునన్ తా దీవెనల్ జేసె; నా
తలపై చేతినినుంచె, యామె కృపచే ధన్యుండనైతిన్‌గదా!

అమ్మ! జగజ్జననీ! యీ పేదను కరుణించి, అవ్వ రూపమున ప్రత్యక్షమై దీవించితివా? తల్లీ! (ఆమె నిలుచున్న చోటును కళ్ళకద్దుకొని) వేంకటేశ్వరా! నాతల్లీ, అలిమేలమ్మ కరుణచే నా దేహములో ఏ అలసటలేదు, నాలో క్రొత్త మార్పులు వచ్చినట్లు మనసున యేవేవో ఊహలు పరుగులు దీయుచున్నవి ఇంక నిన్ను నేను సుఖముగా దర్శింపగలను. (చేతిలోనున్న వాటిని ధరించి నిష్క్రమిస్తూ) స్వామీ! ఏడుకొండలవాడా! వేంకటరమణా! గోవిందా! గోవింద
(నిష్క్రమించును)

(లైటాఫ్)

(గోపురం సీను వేయాలి)

(లైటాన్)

అన్న: (ప్రవేశించును) స్వామీ! వేంకటేశ్వరా! తల్లి కరుణచే యే ప్రయాస లేకుండా నిన్ను సమీపించితిని తండ్రీ! సమీపించితిని (ముందునకు నడచిచూచి ఆనందమున) ఆహా! తరించితిని, యీ జన్మ తరించినది (ముందునకుజూచి)

(బోడిగుండ్లతో చక్క-సూరి-ప్రవేశించి అన్నమయ్యను చూచుచుందురు)

కీర్తన - రచన - అన్నమాచార్య

(తర్వాత విష్ణుముని ప్రవేశించి చూచుచుండును)

అదివో - - - అదివో - - - అదివో -

కీర్తన - రచన - అన్నమాచార్య
(విష్ణుముని ప్రవేశించి చూచుచుండును)

అదివో - - -అదివో - - - అదివో - - -
బంగారు శిఖరాల - బహుబ్రహ్మ మయము
అదె చూడుడు - అదెమ్రొక్కుడు ఆనంద మయము. అ॥
అదివో అల్లదివో - హరివాసము -
పదివేల శేషుల పడగల మయము
అదివో - అల్లదివో - శ్రీహరివాసము అ॥
అదె వెంకటాచల మఖిలోన్నతము
అదివో బ్రహ్మాదుల కపురూపము
అదివో నిత్యనివాస మఖిల జనులకు
అదెచూడు అదెమ్రొక్కు - డానందమయము అ॥
వెంగట నల్లదివో శేషాచలము
నింగినున్న దేవతల నిజవాసము
ముంగిట నల్లదివో మూలనున్న ధనము
బంగారు శిఖరాల బహుబ్రహ్మమయము. అ॥
కైవల్యపదము వెంకటనగ మదివో
శ్రీ వేంకటపతికి శిరులైనది
భావింప సకల సంపదరూప మదివో
పావనముల కెల్ల పావనమయము అ॥
(క్రిందకూర్చుని గోపురమునకు నమస్కరించును)

విష్ణు: (సమీపించి) కుమారా! నీవెవరవయ్యా! మీరు పాడిన కీర్తనకు నా నమస్కారము. నీవు చిన్నవాడ వైనందున, నీకు నమస్కరించ కూడదు. కాన, నీకాయురారోగ్యములు గలుగుగాక, నీకీర్తనచే స్త్రీ వారు. ఆనందభరితులై పోయారు.

అన్న: (లేచి విష్ణుమునికి నమస్కరించి అనంతనున)
స్వామీ! మీరెవరో మహనీయులుగా నున్నారు. దారి వెడలినది మొదలు మహారణ్యమున నాబాధ జూచి ఒక బ్రాహ్మణోత్తముడు అడవిని దాటించినాడు. పర్వతముముందు నేనడుపలేం అలసి మూర్ఛిల ఒక అవ్వ మహాతల్లి! నాకు సేదతీర్చి, దప్పుని తీర్చి. దీవించి పంపినది. ఇప్పుడు మీరెక్కడ నాకు సాక్షాత్కరించి నేపాడిన కీర్తనను అభినం

దించి, నే పాడిన కీర్తనకు నమస్కరించి, నన్ను దీవించినారు. మీరు భగవత్ స్వరూపులు; మీపాదములకు, నమస్కారము
(పాదములకు నమస్కరించును)

విష్ణు: (లేపుతు) కుమారా! లెమ్ము: నీవెవరవయ్యా! ఈ కవిత్వ మెక్కడ నేర్చితివి?

అన్న: స్వామీ! నాకు పెద్దగా చదువు రాదు, స్వామి మీద భక్తితో నోటికి వచ్చిన దంతయు పిచ్చిగా వాగుచున్నాను, ఈ వాగుడు కూడా-యింతకు మునుపే ఆ అవ్వ, నా తల్లిలా నా దప్పి తీర్చినది మొదలు ఆ పానీయములోని ప్రభావమె, నన్నిలా పలికించుచున్నది, ఇదియంతయు ఆ తల్లి దయయేగాని, ఇతరము నాకు తెలియదు. తప్పులున్న, క్షమింపుడు.

విష్ణు: నాయనా! నీవు కారణజన్ముడవు, శ్రీ వేంకటేశ్వరుడు రాత్రి నాకు స్వప్నమందు కనిపించి "విష్ణుమునీ! రేపు నీకొక బాలుడు నాపై కీర్తనలు పాడుచు, కనిపించును, అతనికి నీవు గురువువై ఆదరించు" అని తెల్పెను, ఆ దేవుడు చెప్పిన రీతి జరిగినవి, నీ పేరేమి? నీవూరెయ్యది? నీ తల్లిదండ్రు లెవరో? దస్యులు నీవేకారణంబున యిట కరుదెంచితివో? తెల్పుము.

అన్న: స్వామీ!

కులమున బ్రాహ్మణుండ; నిటకున్ బహుదూరము తాళ్ళపాక నా
నెలవు: ప్రియంబుమీఱ జననీ జనకుల్ నను అన్నమయ్య యం
డ్రెలమిని వేంకటేశ్వరుని నెప్పుడు పాయక గొల్చు బుద్ధి లో
వెలయుట నిట్లు వచ్చితిని, వింటిరె నా చరితంబు నయ్యరో?

స్వామీ! నా చరిత్ర, విన్నవించితిని కాని మీకు శ్రీ వేంకటేశ్వర స్వాములవారు, తన కీర్తనల పాడుచు, ఒక బాలుడు కనిపించును" అని స్వప్నములో తమకు చెప్పెనని యంటిరిగదా! ఆ భక్తుడు తమకు కనిపించినాడా?

విష్ణు: కనిపించినాడు, నాజన్మ ధన్యమైనది, కుమారా!

అన్న: స్వామీ! ఆ మహనీయుని దర్శనము నాకు కలిగించి పుణ్యముకట్టి కొనుడు! (చేతులు జోడించును)



విష్ణు నీ పేరేమి? నీ వూరెయ్యది? నీ తల్లిదండ్రు లెవరో?
ధన్యులు నీవేకారణంబున యిట కరుదెంచితివో? తెల్పుము.

అన్న: స్వామీ!

కులమున బ్రాహ్మణుండ, నిటకున్ బహుదూరము తాళ్ళపాక నా
నెలవు; ప్రియంబుమీఱ జననీ జనకుల్ నను అన్నమయ్య యం
డ్రెలమిని వేంకటేశ్వరుని నెప్పుడు పాయక గొల్చు బద్దిలో
వెలయుట నిట్లు వచ్చితిని; వింటిరె నా చరితంబు నయ్యరో?

విష్ణు: (నవ్వి) నాయనా!

ఎన్నో జన్మల పూర్వపుణ్య పలమే! యీనాడు నిన్గాంచితిన్,
కన్నుల్ ధన్యములయ్యె; నల్ల హరియె గావించె నీరీతిగా,
నిన్నున్ నాదరి చేర్చె, చిత్రమ, హహా! నీపై గదా, స్వామికిన్
ఎన్నో యాసలు, నీదు భాగ్యమును నేనేమంచు వర్ణింతునో?

అన్న: స్వామీ! మీరు నన్ను పరిహసించుట లేదు కదా? నేనేమీ తెలియని వాడను, అజ్ఞానిని చదువు రానివాడను, మీరు నన్నిట్లు మాటలచే నొప్పింప తగునా? నేను మీతో మాట్లాడునంతటి శక్తికూడాలేని వాడను, అందుచే మీరు నన్ను పొగడి కించపరచుచున్నారు. స్వామీ! నేపాడిన కీర్తన, ఆ తల్లి! ఆ అవ్వయె నాతో పాడించినది. అందు తప్పులున్న క్షమింపుడు, నమస్కారము (నమస్కరించి పోబోవును)

విష్ణు: అన్నమయ్యా! ఆగు నాయనా! నా మాటలు నీకు వేరుగా వినిపించి, నీ హృదయమును నొప్పించినట్లు తోచుచున్నది. ఇది దైవసాక్షిగా నిజము, కుమారా!

అన్న: (ఆనందమున పాదములబడి) గురుదేవా! నాజన్మ తరించినది, నన్ను దీవించండి!

విష్ణు. నాయనా! లెమ్ము! నీకు ఆ వేంకటేశ్వరుడు ఆయురారోగ్యములు గలుగజేయుగాక!

అన్న. (లేచును)

విష్ణు: నాయనా! అన్నమయ్యా! నీకు అవ్వరూపమున దేవి ప్రత్యక్షమైనది. బ్రాహ్మణుని రూపమున శ్రీవారు దర్శనమైనారు. ఇక, నీవు ధన్యుడవు, నేను పేరునకు మాత్రము, నీకు గురువును, నీవు తెనుగున తేటతెల్లమగు పదముల దేవిపైన, శ్రీవారిపైన కీర్తనలల్లి స్తుతించి తరింతువు, నీభక్తి కీర్తనలు తెలుగునాట ప్రాకిపోయి, స్వామిపై భక్తిని ప్రబోధము చేయగలవు, అహంకారులకు గుణపాఠములను నేర్పించును నిన్నీలోకమున, ఎల్లరు స్తుతింతురుగాక, ఆదైవాంశ నీకండదండగా నుండు

గాక, కుమారా! ఇక ఆశ్రమమునకు వెళ్ళుదము రమ్ము-నీకు ముద్ర దారణ గావింతును

అన్న: పదండిస్వామీ!

(ఇర్వురు నిష్క్రమింతురు)

(చుక్క, సూరి ప్రవేశింతురు)

చుక్క: మామా! యట్టాగో! మెల్లగ సామిదగ్గర చేరుకున్నాము యిక తలనీలా లిత్తాము పదా!

సూరి: (ఆశ్చర్యంతో) యేంటే! యేంటీ! తలనీలాలూ? నాసామిరంగా! ఈ సూరిగాడు యీడియెంట యెలుతుంటె, నన్ను సూసినోల్లంత "ఒరే! సూరయ్యా! నీతల యెంటుకలకు ఏంపోసి పెంచుతుండవురా? నిగనిగ లాడుతూ, ఎంతో కోమలంగా, పెరిగిపోతున్నాయి, నీకంటె ఏ జుత్తు బాగుందిరా!" అంటుంటారు, ఇంత అందమైన యీతలనీలాలు పోతె, యీదులెంట నేనెట్టా తిరుగుతానె? సెప్పు

చుక్క: మామా! జుత్తు యాడికి పోతాదిరా? గొరిగిపారేత్తె మూన్నాల్లకు, మరీ సొంపుగా, కోమలంగా, వత్తుగా, మొలకెత్తుతాది, యీ కొండకు వచ్చి నోల్లు తలనీలా లిత్తేను సోమికి మా సంబరమంట

సూరి చుక్కా! నామాటినే! నేనుమాత్రం నాజుత్తు గొరిగించుకోను, ఆ!

చుక్క: (చీకాకుగా) నాకరమరా! నాకరమ। దారిపొడుగునా, నీతో తగలాటె, యింతదూరం దేవుడికొండకువచ్చి జుత్తు గొరిగించుకోకపోతె దేవుడు కోపగించుకుంటాడంటరా కోపగించుకుంటాడు, ఆ

సూరి (ఆశ్చర్యంతో) యేంటీ! యేంటీ! యెంటికలియ్యకపోతె, సోమి కోప గించుకుంటాడంటనా? నాకుతెల్దు గదనే (బాధతో) వరే! సూరీ! నీ పిల్లతనంనుంచి, యంతో పేమతో పెంచుకొన్న! యీయెంటికలపైని యీ యంకన్న పగపట్టాడు. ఏమి సెయ్యాలబ్బా!

చుక్క: మామా! రా! మామా! మనం కొండ కొచ్చిందెందుకు? పిల్లలకోసం తెలుసా?

సూరి: తెలుసు-తెలుసే! కాని బంగారంలాంటి యీ జుత్తు బంగమైపోతుందని బాధగా వుందే! (దుఃఖించును)

సుక్క: మామో! ఏడుత్తా వేంటిరా! ఆలుమగలు ఇద్దరు సంతోసంగా, కలిసి యెంటుకలిత్తే! బంగారంలాంటి కొడుకు గుమ్మడి పండులా పుడతా డంట! లేకపోతే స్వామి కోపగిచ్చుకుంటాడంట! ఆ!

సూరి: (బయంతో) అమ్మో! అమ్మో! యేందే! సోమి కోపగించుకుంటాడా! యీ సోమి బాగా లింకుపెట్టాడే? ఆలుమగలు కలిసి తలనీలా లియ్యా లని, యీ సోమి అంతకోపగాడేంటి? నా యెంటుకలమీద యేడుక పన్నాడు.

సుక్క: వరే! యెర్రిమొగమా! అటుసూడు, సిలకాగోరెంకల్లా వుండా రాపసోల్లు: ఆలుమగలు దేవునికి తలనిలా లిచ్చి నవ్వుకుంటూ, యంత ఆనందంగా యెల్లిపోతుండారో? సగము ముసిలోడివి! నీకెందుకురా (జుత్తు పట్టుకొని) యీ జుత్తుపై అంత మోజు? ఎక్కడన్నా ఆడోల్లకుండాలిరా! (లాగును)

సూరి: (జుత్తుచేతితో పట్టుకొని) వసే! వసే! అగు, మనూల్లో అడోల్లేనే, ఈ జుత్తును జూసి "నీజుత్తు బాగుండదిరా! సూరే" అనేది, అందుకేనే, నాకుబాధగా వుంది, అందుకే, నేతలనీలాలియ్యనంటుండేది.

సుక్క వరే! మామా! మనకు పిల్లలు పుట్టాలని, నీకు బుద్ధి వుంటేను, నేచెప్పి నట్టు సెయ్, లేదా? యేడుకొండలవాడా! యే యంకటరమనా! అంటూ! యీ బంగారు కోనేట్లోబడి సచ్చిపోతాను, అప్పటికి నీపీడ పోతుంది

సూరి: యేందే! యీడ, యీకోనేట్లో బడి సచ్చిపోతానంటావు? ఆపని సేయకే! (చేయి పట్టుకొనును)

సుక్క (చేయి విడిపించుకుంటూ ఏడుస్తూ) వదులా! వదులూ! యీ బిడ్డల్లేని గొడ్డుబోతు బతుకు బతికేకంటే, సచ్చేదే మేలు. బిడ్డల్లేక పోయినా, పెల్లాము లేక పోయినా! వూల్లోవాల్లు నీజుత్తును జూచి మెచ్చుకుంటూ వుంటే, నీకంతే వాలు! జుత్తు అట్టెపెట్టుకొని వూల్లోవాల్లతో పొగిడించు కుంటూ వుండరా! నాకంటె, బిడ్డలకంటె, నీకు నీజుత్తే ఎక్కువ, యీ యధవ బతుకు బతికేకంటే, నేను యీకోనేట్లో బడి సత్తేను! పున్నెమైనా వత్తాది, పిల్లలు లేకుండా బతికేదానికంటె యీచావేమేలు (యేడుస్తు పోవును)

సూరి: (బలవంతంగా పట్టుకొని) సుక్కే! సుక్కే! నీవు సావాకె! నీవు సత్తె; నేనెట్టా బతుకుతానె?

చుక్క: (యేడుస్తు) నీకు నీజుత్తుంది లేరా! యింక యీపెల్లా మెందుకు? వూళ్లో వాల్లు నీజుత్తును పొగడుతుంటె ఆనందంగా బతుకు, నేయెలతాను యెల్లి సచ్చిపోతాను, (చేయివిడిపించుకొని యేడ్చుచూ పోవుచుండును)

సూరి: (పట్టుకొని) ఆగె-ఆగె, యీజుత్తు నీవు సచ్చేకాడికొచ్చిందా? బంగారం లాంటి పెల్లాన్ని, యీయదవ యెంటికలకోసం, బంగారకోనేట్లో బడి, సచ్చిపోతాంటె, సూసి, నేబతుకుతానా! యదవ జుత్తు! రాయే సుక్కా! రా! యిద్దరం పోయి, సోమికి తలనీలా లిత్తాము, బంగారంలాంటి బిడ్డలు పుడుతారు, నీవూ బతుకుతావు, నీవూ నేనూ సంతోసంగా వుందాంపదా!

చుక్క: (ఆనందంగా మగని కౌగలించుకొని) నామామె! నామామె: నీవెంత మంచోడివై పోయావురా? మామొ! యిదంతా యేడుకొండలవాని దయరా! మామా! సోమే! దండాలు సోమె! మామా! పోదాం పారా! దేవునికి తలనీలాలిత్తాము.

(ఇర్వురు చేతులు పట్టుకొని నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)



# నాలుగవ సీను

(రోడ్డు సీను)

(చేత బుట్ట పట్టుకొని ప్రవేశం)

(వెనుక ప్రవేశించి) స్వామీ! స్వామీ!

(ఆగి తిరిగి చూచును)

(సమీపించి) స్వామీ! మా చిన్నోడి నేమైనా చూశారా?

అమ్మా! తెలియదు, (పోబోవును)

స్వామీ! సరియైన సమాధాన మివ్వకుండానే, వెళ్ళిపోతున్నారేమి?

(ఆగి) నాకు మీచిన్నోడు తెలిసివుంటె, చెప్పేవాడిని తల్లీ! అయినామీ దేయూరు?

అయ్యా! మా చిన్నోడే మీకు తెలియదన్నారు, యిక మా వూరితో మీచేమిపని?

(చిన్నగనవ్వి) అవునమ్మా! మంచి మాటన్నారు, మీ చిన్నోడే తెలియనప్పుడు, మీవూరితో యేమిపని, నిజమే తల్లీ! వస్తాను.

స్వామీ! ఇక్కడేమైనా, మఠాలున్నాయా?

ఎందుకు తల్లీ!

వాడేమైనా సన్యాసుల్లో కలిసిపోయా డేమోనని

తల్లీ! నీవు చాలా అమాయకురాలివిగా నున్నావు. ఆ చిన్నోడు మీకే మౌతాడమ్మా!

నా కొడుకే స్వామీ!

కొడుకును వెతుక్కుంటూ వచ్చావా తల్లీ? యీ తిరుపతిలో ఉన్నట్లు మీకెవరైనా చెప్పారా?

అవును స్వామీ! వాడు తిరుపతి కొచ్చాడు, పైగా వాడికి యీ తిరుపతి దేవుడంటే. చాలా ఇష్టం వివాహ మయిన పదేళ్ళకు గాని మాకు సంతానం లేకపోతే మా యిలవేల్పయిన యీ తిరుపతి దేవుడికి వ్రతముండి పూజలు జరిపించాము, అప్పుడు మాకు సంతానం గలిగింది, మాసంతానంలో వీడు రెండవవాడు, వీడు ఇక్కడికి వచ్చి ఇటే నిలిచిపోయాడు, పైగా చెప్పకుండా వస్తె యేమనుకున్నాడో యేమో, తిరుపతంతా వెదికాను, యిక మఠాలుచూచి వెళ్ళిపోదా మనుకున్నాను

(లైటాన్)

(తెరలో కీర్తన వినిపిస్తూ వుండాలి, విష్ణుముని, లక్కమాంబ ప్రవేశము(

విష్ణు: (ఉచితాసనము జూపి) అమ్మా! స్వామివారు దైవపూజలో ఉన్నారు, కొంతసేపు ఇక్కడ కూర్చోండి.

లక్క: మంచిది స్వామీ! (కూర్చొనును)

విష్ణు (లోపలకెల్లి నీళ్ళు తీసికొని వచ్చి) అమ్మా! యీ నీళ్ళు త్రాగండి! స్వామి పూజ ముగించుకొని వచ్చును

లక్క: (నీళ్ళు తీసుకొని త్రాగి) స్వామీ! చల్లని నీళ్ళ నిచ్చినావు. నీ కడుపు చల్లగగాను! స్వామీ! లోపలున్న ఆ స్వామిని పిలువండి! యింకా యీ తిరుపతిలోని మఠాలన్నీ చూడాలి, పొద్దుపోతుంది

(తెరలో మంగళహారతి, గంట వినిపించును)

విష్ణు: పూజ అయిపోయింది తల్లీ! వస్తారు! అయ్యా! అన్నమయ్యా! కొంచెము బయటికి వస్తారా?

అన్న: (తెరలో) ఆ! ఇదిగో వస్తున్నాను.

లక్క: (ఆశ్చర్యంతో) స్వామీ! మీరు ఎవరిని పిలుచుచున్నారు? మాచిన్నోడిని కాదుకదా!

విష్ణు: మీ చిన్నోడు కాదు తల్లీ! మా శిష్యుడు, అన్నమయ్య గారిని పిలుచుచున్నాను, ఏమిటమ్మా! ఏదో ఆలోచించుచున్నావు?

లక్క: మా చిన్నోడి పేరు అన్నమయ్యే! కానీ మా చిన్నోడు కాదుగదా?

అన్న: (ప్రవేశిస్తూ) గురుదేవా! నమస్కారము, పిలచిన కారణము? (లక్కమాంబను జూచును)

లక్క: (లేచి ఆశ్చర్యంగా చూస్తూ వుంటుంది)

అన్న: అమ్మా! (పాదముల పడును)

లక్క: (అనుమానంగా) నాయనా! మీకొరకె వచ్చినాను, మాచిన్నోడి నేమైనా చూచినారా? స్వామీ!

అన్న: (లేచి) అమ్మా! నేనమ్మా! నేనే మీచిన్నోడిని తల్లి.

లక్క: (ఆశ్చర్యముతో)నాయనా! మాచిన్నోడు అంటేను మాఅన్నమయ్యస్వామీ!

అన్న: అవునమ్మా! నేను మీఅన్నమయ్యనే!

లక్క: (బాధ, ఆనందము, ఆశ్చర్యముతో) ఒరే! ఒరే! ఎంత పెద్దవాడవై పోయావయ్యా! ఏలా మారిపోయావు? ఏమిటీ వేషం? (కళ్ళ నీరు నింపుతూ కౌగలించుకొని) నాయనా! నీకేమి తక్కువని యింతదూరం వచ్చి, యిలా సాధుల్లో కలసి పోయావు; ఈ మఠాల్లో వుండిపోవడం నీకేంఖర్మ నాయనా! బండంత సంసారాన్ని బజారు పాలుజేసి పారి వచ్చావే? చిన్నోడా! నీకోసం పల్లె పల్లె మీనాన్న నేను వెతికాముదా! కనిపిస్తేనా? ఇక్కడికి వస్తె కనిపించావు. నిన్ను జూచి, ఇప్పుడు నా ప్రాణం కుదుటపడింది.

అన్న: అమ్మా! నాకొరకై ఎంత ప్రయాసపడినారు? అయినా, ఇంత దూరం ఎందుకు వచ్చినావు తల్లీ!

లక్క; (బాధగా) అదేంటిరా? అట్లంటున్నావు. నీకు సంసారం కాబట్టదా?

అన్న: అమ్మా! బాధపడకు, ఇక సంసారంతో నాకేమి సంబంధంలేదు. నేనిక్కడే, ఈ స్వామి పాదముల చెంత యీ దేవుని ప్రార్థించు కుంటూ ఉండిపోవాలనుకున్నాను.

లక్క: ఇక్కడ నీకెవరున్నారయ్యా!

అన్న: (నవ్వి) యిటుచూచితిరా! వీరు మా గురుదేవులు

లక్క: చూచినాను నాయనా! యీ స్వామియే నన్నిటకు తీసికొనివచ్చినారు.

విష్ణు· అవును. నాయనా! ఈమె వీధిని కనిపింప నేనే తీసికొని వచ్చితిని

అన్న: గురుదేవా మంచిపని చేసితిరి. ఈమె నన్ను కన్న తల్లి.

విష్ణు (లక్కమాంబ పాదములకు నమస్కరించును)

లక్క. లే! నాయనా! లే! వీడు ఇంటికి రానంటున్నాడు. వీడి వాలకం ఏమైనా బాగుందా? స్వామీ! మీరైనా చెప్పండి. నాకు ఇద్దరు కుమారులు. అందు వీడు చిన్నవాడు. వీడు ఇటు వచ్చిన కొంత కాలానికే పెద్దకొడుకు కన్నుమూశాడు (దుఃఖించును)

అన్న: (ఆశ్చర్యముతో) అమ్మా! అన్నయ్య చనిపోయాడా? (నిర్ఘాంతపోవును)

లక్క. (దుఃఖమున) అవునయ్యా! చనిపోయాడు. ఇంక ఇంటిలో ఎవరున్నారు? వదినా? విధవయై వారితల్లిగారి యిల్లు చేరుకుంది. మీ నాయనగారా? నీకోసం దిగులుతోను, అన్న పోవడంతోను, మంచంపట్టాడు, నేనా? ముసలిదాన్నయిపోయాను, ఇంటిపనులు, పొలంపనులు నేను చూచుకో గలనా? పోనీ! మేము చనిపోతె. తలకొరివిపెట్టే దానికైనా నీవు అవ సరమా? చిన్నోడా (కన్నీరు తుడుచుకొనును)

అన్న: (పలుకక నిశ్చేష్టుడై యుండును)

లక్క: పలుక వేమిరా? చెప్పు (దుఃఖించును)

అన్న. (నిట్టూర్చి) అమ్మా! నేను మరీ ఆ సంసారబంధంలో చిక్కి బాధపడలేను

లక్క· అయ్యో! అయ్యో! ఇదేంటిరా? సంసారివిగాక యిలాగె సన్యాసివై పోతావా?

అన్న: అవునమ్మా! యిలాగే!. యీ గురువుగారి శిష్యత్వంలోనె! యీ దేవుని సన్నిదిలో! వుండిపోవా లనుకున్నాను.

లక్క: (బాధగా) స్వామీ! వింటూనే వున్నారుగదా? మాచిన్నోడి మాటలు, ఏమైనా బాగున్నాయా? మీరు చెప్పండి

విష్ణు: నాయనా! అన్నమయ్యా! నీదారికి నేనడ్డువస్తున్నానని బాధపడకు. యీ తల్లి లేకపోతే నీ కీజన్మ లేదుకదా!

తల్లియు, తండ్రిని గనిన ధన్యులు, పెంచిన దేవులయ్య, నీ
వెల్ల విధాల వారి ఋణ మీగుట తప్పదు, సేవచేయుచో
చెల్లు ఋణంబు, నే తమకు చెప్పెడి నంతటి వాడగాను, నీ
తల్లిని బాధపెట్టు టది తప్పుగదా! చనుమయ్య యింటికిన్.

-ఇది గురువాజ్ఞగను; దైవాజ్ఞగను, బావించు, నేను నీ తల్లికొరకు చెప్పలేదు. మానవధర్మమును ఉపదేశించుచున్నాను, అదియునుగాక నీజాతకమున గృహస్థాశ్రమమును స్వీకరించు నట్లున్నది, ఇది యంతయు దైవాజ్ఞ, "తానొకటి తలచిన దైవమొకటి తలచు నట్లున్నది, ఎప్పటి కేదిజరుగవలెనో? అదే జరిగి తీరాలి. తల్లివెంట శుభముగా పోయిరమ్మా!

అన్న· గురుదేవా! మరీ నేను మిమ్ము చూడగలనా?

విష్ణు: అయ్యా! అంతా దైవమాయ, నీమనసునన్నున్న కోర్కెలు తీరగలవు. పోయిరమ్మా!

అన్న· (విష్ణుముని పాదములకు నమస్కరించును)

విష్ణు: (లేపి) నీకోర్కె సిద్ధించుగాక! (లక్కమాంబ పాదములకు నమస్కరించును)

లక్క: (లేపి) స్వామీ! నూరేళ్ళు వర్ధిల్లుము, వస్తాము. నీమేలు మరువము.

(నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)

# ఆరవ సీను

(దారి)

వేంక: (ప్రవేశించి నడచుచుండును)

లింగ: (తెరలోనుండి వెనుక భాగమున పిలుచుచు ప్రవేశం)
వరే వెంకా! వెంకా!

వెంక: (ఆగి తిరిగి చూచి) ఓ! నీవా! లింగమయ్య మామగారూ! పిలిచారా!

లింగ: అవునోయ్, ఎక్కడికి వెళ్ళుతున్నావు? (అంటూ సమీపించును)

వెంక. మన అన్నమయ్యగారికి, తిరుమలమ్మ అనే అమ్మాయితో వివాహం జరిగి పోయింది గదా!

లింగ అవును, అన్నమయ్య పెళ్ళికి నేనూ వచ్చాను లేవోయ్· ఆ పెళ్ళంత నీదేగా ఉండిపోయింది, నేను నిన్ను హెచ్చరించాను, కాని నీవు చూచి చూడనట్లు వెళ్ళిపోయావు.

వెంక: మామా! క్షమించు అంత గమనించలేదు.

లింగ. అల్లుడూ! ఏమనుకోకు, ఒకమాట అడుగుతాను. ఆ తిరుగుబోతు వెధవకి పెళ్ళెందుకు చేశారా! అని నాబాధ, అల్లుడూ! వాడి అదృష్టమేమో గాని, రంభలాంటి పిల్ల దొరికిందోయ్।

వెంక అందగత్తే గాదు మామయ్యా! గొప్పతెలివైనది చదువరి కూడా,

కేశ: (ప్రవేశిస్తూ) ఎవరు వెంకయ్యా! గొప్ప చదువరి అంటున్నావు! మన తిరుమలమ్మ గురించేనా?

వెంక. అవును కేశవా! ఆమెను గురించే చెప్పుచున్నాను.

కేశ: అది అంతా! అన్నమయ్య అదృష్టము లేవయ్యా!వూరు వదలి పోయిన వాడు మరీ ఇంటికి తిరిగిరావడం అందునా, దైవభక్తుడు కావడం, అది అంతా, ఆ లక్కమ్మగారి అదృష్టంలే, అయినా అన్నమయ్యకు అన్నివిధాల తగిన భార్యే లభించింది

లింగ: అవును, అబ్బాయికి అమ్మాయి అన్నివిధాలా తగినదె! సంతోసము కాని మరి అమ్మాయికి అబ్బాయి అన్నివిధాలా తగినట్లు ఉండొద్దూ! రాత్రిం బవళ్ళు ఆ వేంకటేశ్వరుని భక్తికీర్తనలు పాడుకుంటూ అన్నమయ్య తన ఆనందంలోతాను ఉండిపోతే? మరి వచ్చిన ఆకొత్త పెళ్ళికూతురి అవస్థ! ఏంగాను?

కేశ: లింగమయ్యగారూ! మీరనుకున్నంత అవివేకికాడు ఆ అన్నమయ్య, మహాజ్ఞానియై పోయాడు సుమా!

లింగ: అవునోయ్! అతను జ్ఞానియైపోయాడు, నిజమె! అతడేమో జ్ఞానియై, జ్ఞానబోధ కీర్తనలు పాడుతుంటె, వచ్చిన ఇల్లాలు ఆ తత్వాలకు తగినట్లు తంబురవాయిస్తూ కూర్చోవాలి! ఎంత తెలివైనదైతే మాత్రం ఏం చేయను? ఆమె అదృష్టం అలామండిపోయిందిలే, పాపం!

వెంక: మామా! మీరనుకున్నంత తేడా యేమీలేదు, అన్నమయ్య, భక్తి కీర్తనలు పాడుతుంటాడే గాని, ఆ అమ్మాయి మాత్రం, ఆ కీర్తనలకు తంబుర వాయించదు. ఎందుకు? మీరు ఇంకా కొంతకాలం బ్రతికే వుంటారు. చూస్తారుగా! అన్నమయ్య కాపురాన్ని!

లింగ: ఏమన్నావూ! ఏమన్నావూ! నన్ను ఇంకాకొంతకాలము బ్రతికే వుంటావు, అంటున్నావు. అంటె! చాలా కాలం నేను బ్రతకకూడదని నీఉద్దేశ్యమా! నాకు ఎంతో కాలం బ్రతకాలని ఆశవుంది, ఎంతో కాలం బ్రతుకుతాను, కొంతకాలమేమిటి?

కేశ : కాకిలా వుంటావు లేవయ్యా! పదా! వెంకా! ఏవో కొంత మంచి కాలక్షేపము చేసి వస్తాము, యీనగారితో యెందుకు అనవసర ప్రసంగం? (నిష్క్రమించును)

వెంక· వస్తాను మామయ్యా! (నిష్క్రమించును)

లింగ· (ఆవేశంతో) వరేయ్, పొరపాటున నీతల్లి తండ్రులు "కేశవా!" అని పవిత్రమైన, ఆమహావిష్ణువు పేరు పెట్టారు, సార్థకములేదు, నీవు కేశవుడవు గాదురా! శవానివి, ఛీ! పొద్దుననే, ఎవరిముఖం చూశానో! నీతో నడివీధిలో, "కాకి" అనిపించుకన్నాను. ఉండురా! శవం, ఉండు! (నిష్క్రమించును)

(తెరపడను)

# ఏడవ సీను

(పొలం)

తిరు : (పొలంగట్టుపై కూర్చుని ఉంటుంది తెర తెరువబడును)

అన్న (ప్రవేశించి) తిరుమలా! ఏమిటి ఆలోచిస్తున్నావు? (సమీపించును)

తిరు : (లేచి) స్వామీ! నమస్కారము.

అన్న: (మీద చేయివేసికొనినడుస్తూ) ప్రశాంతముగా, యీపొలము గట్టున కూర్చుండి, సాయంకాలము పైరుపైనుండి చల్లగా, మెల్లగా కదిలి వీచే పిల్లగాలుల కదలికలో పరధ్యానములో మునిగి పోయావు. నీవు రచించు చున్న సుభద్రాపరిణయములోని ఘట్టములను గురించేనా? (కొంత దూరము తీసికొనిపోయి ఒక పచ్చిక బయలున కూర్చునపెట్టి తాను ప్రక్కన కూర్చుసును)

తిరు : స్వామీ! ఆ సుభద్రాపరిణయములోని ఘట్టములను గురించికాదు, ఈ పొలము ప్రకృతి అందమును తిలకిస్తూ కూర్చున్నాను

అన్న: ఈ ప్రకృతి నీకంటె అందముగా ఉందా? తిరుమలా?

తిరు : (చిరునగవున) స్వామీ! నా అదృష్టము, నేను మీకు అందముగా కని పించడం

అన్న: ఎందుకూ?

తిరు : స్వామీ! ఏలయందురా?

ఇల సౌఖ్యంబుల తల్లిదండ్రులను నీ యింటిన్ విసర్జించి, మున్
గొలువై యుంటివి మౌని వోలె, విధియే కూర్చెన్ గదా నిన్నిటన్,
తొలి నా పుణ్య ఫలంబు నాకు తమరున్ తోడై తిరే స్వామిరో!,
ఇలలో జన్మము నెత్తితేని,మరి మిమ్మే భర్తగా గోరెదన్.

కావున, యీ నీమూర్పు, నాఅదృష్టము గాదా? మీరు సంసారులుగాక యోగులై యున్న నేనేమవ్వాలి?

అన్న: అయ్యో! తిరుమలా! నీవు లేకున్న నేనెంతవాడను?

ఎట్లన,

తలపున దైవచింత నను తాళగ నివ్వక, ఒక్క చోటునన్
తలనటు దాచనీక కొని తాజనె. పోయితి నేమిసేతు? నిన్
గలిసెడి భాగ్యమేగలుగ, కాంతరో! యియ్యెడ కేగుదెంచితిన్
తలపగ నాడు పుణ్య మిది, దారగ నిన్ గొని సౌఖ్య మందితిన్.

తిరు : స్వామీ! పూర్వజన్మ సుకృతమున జరిగిన కార్యమిదియని తలంతును

అన్న: అవును అంతియె-కాని! తిరుమలా! నీవు రచించుచున్న సుభద్రాకల్యాణ మున మునిరూపములో నున్న అర్జునుని వర్ణించినట్లు నన్ను నీవు వర్ణించిన విని యానందింప కోర్కె గల్గినది.

తిరు : (ఆనందమున నవ్వి సమీపించి) స్వామీ! నేను మిమ్ము వర్ణించుటకు చాలను.

అన్న: అనగా వర్ణనకు

తిరు : అతీతుడవు, పదకవితా కీర్తనచక్రవర్తులు మీరు, మిమ్ము వర్ణన సేయుమన్న, నాకవితకు వెలుగు వచ్చినది, నాకవితకూడా చరితార్థము కాగలదు

ఆనేత్రంబుల యందమా, నుదుటి తీరా భ్రూలతా విభ్రమం
బానీలంబగు శౌరి వర్ణముల సోంపాహా! నుతిన్ సేయగా
నానే? లేజవరాంద్రుడు నిన్ను గనుచో నాకృష్ణులై గ్రమ్మరే?
యానాడా జడదారి యర్జునుడు నీ కందంబునన్ సాటియే?

అన్న: (ఆనందమున కౌగలించుకొని) ఆహా! ఆహా! తిరుమలా! నీచే వర్ణింపబడి నేపవిత్రుడ నైతిని, నన్నే ఇంతగా వర్ణించిన నీకలము యింక ఆ మునివేషధారియైన అర్జునుని ఎంతగా వర్ణించియుండునో?

తిరు : పతిదేవులు క్షమించాలి-పరపురుషుల పతివ్రతలు వర్ణింప తగదు, కావున మీముందు నిజముగా ఆ పాండవ మధ్యముడు, దీటురాడని నాయూహ,

అన్న: తిరుమలా! నీవు సామాన్యురాలవు కావు, నాపాలిటి కల్పలతవు, అటు చూడు, ఆ సంజ కెంజాయల రమణీయత, ఎంత అందముగా కనిపించుచున్నదో?

తిరు : స్వామీ! సాయంకాల సమయమున, ఆ బాస్కరుడు తన వెలుగును తగ్గించినను, ప్రకృతి దేవత అతనిపై అపేక్ష వీడక, ఆతని విడచి ఉండలేక వెంటబడినట్లు, మరింత శృంగారించుకొని అతనిని మురిపించుచు, మీరు మరీ ఎప్పుడు వత్తురని హెచ్చరించు చున్నట్లు అతనివైపే చూచుచున్నది.

అన్న: ప్రియురాలా! నీ మధురమైన వాక్కులను యీ సాయంకాల సమయమున పొలములు సైతము పిల్లగాలులు పైరుల కందింప అవికూడా ఆనంద

మున మైమరచి కదలాడుచు, మెల్లగా ఒకరితోనొకరు మనల గురించి యేమేమో చెప్పుకొనుచున్నవి, చూడు!

తిరు : (చిరునగవున) స్వామీ! నేను మీప్రక్కనున్న మీ మనసున కేవేవో ఊహలు జనించి, నన్ను వర్ణించుచు, కాలమే మరచిపోవుచున్నారు, అత్తగారు మనకొరకై ఎదురుచూచు చుందురు-వెళ్ళుదమా?

అన్న: నిజము వచించితివి, కాని!

చందురు బోలు నీముఖము చల్లని నీచిరునవ్వు మాటలున్
సుందరి నన్నిటన్ పరవశున్ నొనరించెను, హాయిలోన, నే
నెందున నుంటినో దెలియ నెప్పుడు, న్ప్రాణమైక మోహినీ!
పొందితి స్వర్గ సౌఖ్యముల పోయెను కాల మదెంతొ తోపదే!

(కౌగిలించును)

తిరు : (చిరునగవున) ఇక విడుతురా;

అన్న. (నవ్వి) విడువను, ఇటే,

తిరు సమయా సమయములు మరచిపోవుచున్నారు, పదండి.

అన్న: దేవిగారి యాజ్ఞ వెళ్ళుదము పదా (కౌగిలి విడుచును)

(ఇరువురు నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)



# ఎనిమిదవ సీను

(వేంకటేశ్వరులు - అలిమేలుమంగమ్మ)

అలి : (ప్రవేశించి) స్వామీ, స్వామీ,

వేంక: (ప్రవేశిస్తు) దేవీ; ఏమిటాతొందర

అలి : స్వామీ, అన్నమయ్య భార్యావియోగమున, లోకమే మరచిపోయాడు.

వేంక: అందులకు నీవే కారణము,

మనపై భక్తినిమాని యా తిరుమలమ్మన్ నైక్యమై పోయెనే
యని నీవేగద అన్నమయ్య పయినిన్ ఆవేశమున్ చెందియున్
వెనుకన్ ముందును యోజసేయ కిటు గావింపీ గతిన్ చేసితే
మనలన్ లోకమునున్ త్యజించె యత డేమౌనోగద యింకపై

అలి : ప్రభూ; అది నాతప్పా?

వేంక: అలిమేలూ, నిన్ను నేనెంత ప్రేమించుచున్నానో నీకు తెలియదా? "నీవెప్పుడు భార్యాలోలుడవై భక్తులనే మరచిపోవుచున్నా" వని ఒక మారు నీవేనన్నావు? మరి మానవ మాత్రుడైన ఆ అన్నమయ్య తిరుమలను గాఢంగా ప్రేమించి యుండడం తప్పా?

అలి : (విషాదమున) స్వామీ! ఆవేశమున అన్నమయ్యకు తీరని అన్యాయము చేసితినని ఇప్పు డర్థమగు చున్నది,

వేంక: దేవీ! నీవన్యాయమేమీ చేయలేదు. మంచిపనినే చేసితివి,

తిరుమల దేవియే తనకు తీయని సౌఖ్యములందు తృప్తిగా
సరసన నుండి ముంచె మనసారగ, నామెయు, అట్టి భార్యనే
మరువగ సాధ్యమా? సఖియ! మారు టెటుల్, కడుకష్ట మౌనుగా
కొరతయు గల్గునే మనకు కూరిమి భక్తుడు దూర మౌటచే,

అలి: స్వామీ! యీ అన్నమాచారి సమస్య, మనసునకు ఆవేదన గలిగించు చున్నది,

వేంక: ప్రియురాలా! చింతింపకు, అన్నమయ్యకు, మరోకన్నియతో వివాహము జరిపించిన అతడు, మరీ మన భక్తుడుగా మారునేమో?

అలి : స్వామీ! అన్నమయ్య తిరుమలదేవిని తప్ప, మరి ఎవ్వరివైపునను కన్నెత్తి చూడని, ఏకపత్నీ వ్రతుడు, అతని నిర్ణయ మొకటె,

వేంక: అవును అదియు నిజమె, మరి ఆలోచించి అతనినిమనవై పునకు పూర్వపురీతి మరలించుటకు ఆలోచించాలి

అన్నివిధాల నా తిరుమలాంబను బోలియు నుండునట్లుగా
కన్నియ యొక్కటే యిపుడు కావలె ప్రేయసి, అన్నమయ్య యా
కన్నియనే కనుంగొనిన కన్పడు నాతనిలోన మార్పులం
చన్నది యూహ తోచె తమ రందులకేమని యాన తిత్తురో

అలి : స్వామీ! ఆన తేమున్నది, నేనదే యూహించి యిప్పుడొక, బాలికను తిరుమలాంబవలెనే, జన్మింప జేసి అనాధశరణాలయము నందుంచితిని ఆమె యిప్పుడు యుక్తవయసురాలై వున్నది.

వేంక: (సంతోషమున కౌగలించుకొని) ప్రేయసీ! రానురాను, ఆడవారు పురుషులకంటె మేధావులై పోవుచున్నారు, యీ కలియుగమాయ మీ వరకు వచ్చినది, కానిమ్ము, మంచిపని జేసితివి. యిక పోయివత్తము. అన్నమయ్య స్థిమితములేనివాడై మనశ్శాంతికొరకు తిరుమల చేరగలడు తరువాత కార్య మనుకూలించును రమ్ము. పోవుదము.

(ఇర్వురు నిష్క్రమింతురు)

(తెర వ్రాలును)

———o———

# తొమ్మిదవ సీను

(ఏకాంతమందిరం)

అన్న: (విషాదమున కూర్చునియుండి, లేచి) వేంకటేశ్వరా! నాకేమిటీ పరీక్ష? సంసారముపై రోత పుట్టి, ఇల్లు, వాకిలి, తల్లితండ్రిని, అన్నవదినెలను వదలి, జన్మ స్థలమును త్యజించి, అష్ట కష్టముల కోర్చి, తల్లి అలిమే లమ్మ దయకు పాత్రుడనై మీ అభిమానమున మీ చరణారవిందముల చెంత, నీనామజపము జేసికొనుచు జీవితాన్ని గడపదలంచిన నన్నుమరీ ఇట్లేల చేసితివయ్యా! ఒక అపురూప సౌందర్యవతియు జ్ఞానవతియు, మహాకవయిత్రియు, గుణవతియును నైన ఇల్లాలిని నాకు జత కూర్చితివి అందులకు నేనెంతో మురిసిపోవుచు, ఇదియంతయు నాతల్లి అలిమేలమ్మ కరుణ, మీదయ, యనియు, నామనమున మీ ఔదార్యమును కొని యాడుచూ, కాలము గడుపుచుంటిని, కాని అతిత్వరలో నా తిరుమలను సంతానవతిని గావించి ఆమెను నానుండి దూరము చేసి, నన్ను వ్యసన సముద్రములోనికి త్రోసితివేమయ్యా! నా తిరుమలను నేను ఒక్కక్షణం గూడా విడివియుండలేని స్థితికి జేర్చితివే! ఇంక నా దేవత, నా తిరుమల నాకెట్లు లభించును? (నిట్టూర్చి, తిరిగి) తిరుమలా! తిరుమలా! నీవునన్ను విడిచిపోవుట న్యాయమా? నీవే లోకమని జీవించుచున్న నీ భర్తను, వంటరి వానిని, జేసిపోవుటకు నీకు నేనేమపకారము గావించితిని? ప్రేయసీ! నీవు లేక నేనెట్లు జీవింతును

ననుబాసి క్షణమేని నడువ వొంటరి గాగ నేనె నీప్రాణ మం చెంచితీవు
నను ముందు పూజించినాకు సేవలు జేసి తరువాత దైవంబు తలతువీవు,
అత్తమామల పూజ లాచరించి పిదప నీఇంటి పనులపై నిలుతు వీవు'
మాఇంటి మకుటమై మాకు దేవతవయ్యు మాఇంటి దీపమై మసలినావు,

తిరుమలా! మాకు నీకును తీరె ఋణము
నీవులేని యీయింటనే నిలువగలనె?
బ్రతుక నేర్తునె నినుబాసి? ప్రణయమూర్తి,
చీకటయి పోయెనే నాదు జీవితంబు?

(కన్నీటితో) తిరుమలా! విరాగినైన నన్ను రాగిని జేసి, నీవు దైవ సాన్నిధ్యమునకు నిశ్చింతగా చేరుకున్నావు. నేను నీచింతలోమునిగి నీవు వెళ్ళుతూ, నా కొసగిపోయిన నీ ప్రతిబింబమును చూచుకుంటూ ఎన్నాళ్ళు జీవించవలయునో నాకే తెలియకున్నది? నీవు లేని నీ ప్రతి బింబము నాకెందుకు? నాతల్లి అలిమేలు మంగమ్మ, తండ్రి శ్రీనివాసులు, తరువాత నీవేగదా నాదేవతవని నమ్మి, నాకన్న భాగ్యవంతుడు, అదృష్టవంతుడు యీ ప్రపంచమున మరొకడు లేడని, ఆనందించు చుంటిని. నా తల్లి అలిమేలుమంగమ్మ కోరి. నిన్ను నాదరికి పంపినది, మరీ ఆ తల్లియె త్వరగా నిన్ను తనవద్దకు రప్పించుకున్నది. నీవెంత ధన్యురాలవు (ఆలోచించి అటు ఇటు తిరిగి) తిరుమలవాసా! నీ నాటకము చాలావిచిత్రము స్వామీ! ఇక యీ విషవలయములో చిక్కకొని నెనేన్నినాళ్ళు జీవించవలయునో? తెలియకున్నది

లక్క: (ప్రవేశించి విషాదమున) కుమారా! ఎన్నినాళ్ళిట్లు దిగులుచే కూర్చుందువయ్యా! నీకు నేను నీతిని బోధించు నంతటి దాననుగాను, కన్నతల్లి బాధ నన్ను కృంగదీయుచున్నది. ఉన్న ఇర్వురు కుమారులలో, ఒకడు గతించి పోయినా, రెండవవాడైన ఇంటిదాపున నుండునుగదా! యని కొండంత యాశతో నుంటిని, కాని, ఆ వెంకటరమణుడు యేలనో? అన్ని ఆనందములను క్షణములో మాయముజేసి బంగారంలాంటి కోడలిని తీసికొనివెళ్ళి ఇంటిని శోకసముద్రములో ముంచినాడు (కన్నీరు నింపును)

అన్న: అమ్మా! ఆరాటపడకు, ఇదియంతయు స్వప్నగతి సాగిపోయినది. దుఃఖించి లాభమేమి, పైగా ఇప్పటి నా పరిస్థితి, ఏమీ బాగలేదు. ఇక్కడనున్న, క్షణక్షణము తిరుమల నాకళ్ళముందు మెదలుచుండును, నేను శాంతముగా నుండుటకు తిరుపతికి వెళ్ళ దలచితిని, అక్కడ మా గురువుగారి సాన్నిధ్యములో, నాతల్లి అలిమేలుమంగమ్మను, తండ్రి శ్రీనివాసును ఆరాధిస్తూ, కొంతకాలము గడపినగాని, నాకు మనస్తిమితము గలుగదు.

లక్క: కుమారా! తిరుమల పోయినది మొదలు నీకే కాదయ్యా! యీ యింటికే శాంతి లేదు కాని, నాయనా! ఒక చిన్నమాట,

అన్న: (తల్లివైపుచూచును)

లక్క: మరీ నీకు వివాహము గావించిన, నీకు మాకు, యీ యింటికి శాంతి గల్గునని, నాఆశయ్యా,

అన్న: జననీ! తొందరపడకు, కాలము కలిసి రానిదే మానవ ప్రయత్నము అనుకూలింపదు, కావున కొంతకాలము, నిశ్చింతగా నీవు తండ్రిని చూచుచుండుము, నేను తిరుమలకు వెళ్ళుచున్నాను, నాకు సెలవు దయచేయుము, (పాదములకు నమస్కరించును)

లక్క: కుమారా! నీవు మనశ్శాంతి గలిగి సుఖివై యుందువుగాక! (దీవించి నిష్క్రమించును)

అన్న: (లేచి ఆలోచనగా, అటుఇటు తిరిగి) ఏమిటీ విచిత్రము? నేను పరిపరి విధముల భ్రాంతులకులోనై కామాపేక్ష గల మాయలకు చిక్కి వెకలినై పోయాను (నిట్టూర్చి) వేంకటేశ్వరా! మున్ను నాకున్న నిగ్రహశక్తి, యీనాడు ఏల సన్నగిల్లిన దయ్యా!

(కీర్తన - రచన - అన్నమయ్య)

నటనల భ్రమయకు నామనసా!
ఘటియించు; హరియే! కలఁడాడూ, ॥న॥

ముంచిన జగమిది, మోహినీ జగము
పొంచిన యాస పట్టించే దిది,
వంచనల నిజము వలెనే వుండును
మంచులు మాయలె మరునాడు, ॥న॥

సరి సంసారము సంతల కూటమి
సొరిదిఁ బచారము చూపేదివి
గరిమ నెప్పుడుఁ గలకల మనుచుండును
మరులగు విధమె మాపటికి, ॥న॥

కందువ దేహముగాని ముదియ దిది;
అందిన బహురూప మాడే దిది,
యెందును శ్రీ వేంకటేశ్వరుఁ డుండును;
డిందు పడగఁనిదె తెరమఁరగు, ॥న॥

(తెరపడును)

# పదవ సీను

(రోడ్డు)

కేశ : (విషాదంతో ప్రవేశం)

లింగ: (వెనక ప్రవేశిస్తూ) నాయనా! కేశవా! అదే ఉన్నాడుగదా! ఆ వేంకటేశ్వర భక్తుడు; అన్నమయ్య, అతని భార్య చనిపోయిందటగా? పాపం ఎట్లు చనిపోయింది నాయనా? బంగారంలాంటి బిడ్డ ఆ నామాల రాయుడి కిచ్చి అన్యాయం చేశారు, యేదో తాను పుణ్యాత్మురాలె! త్వరగా పోయింది.

కేశ . లింగమయ్యగారూ! వాడు అదృష్టజాతకుడని నేను అనందించాను, వాడికి ఆ ఇల్లాలితో సుఖించే అదృష్టం లేదు, మంచి చదువరి, జ్ఞాన వంతురాలు, మన వూరికే ఒక దీపం వంటిది,

లింగ వాడి ఖర్మ గాకపోతేను, బంగారంలాంటి భార్య చనిపోతుందా? పైగా మొన్నటి పెళ్ళికూతురు, మాయదారి బాలెంత జబ్బు, ఆమెకే రావాలా? ఆ అమ్మాయి తల్లిదండ్రు లెంత బాధపడుతుంటారో? పాపం!

కేశ : వాడికి ఆ యిల్లాలు పోయింది మొదలు మనస్థిమితము లేదు, ఏదో ఆలోచిస్తూ వుంటాడట.

లింగ. కేశవయ్యా! వాడికి ముందే మనస్థిమితము లేక వూరు వొదిలి దేశాలు పట్టుకపోయాడు, లక్కమ్మ పెద్దకొడుకు పోయాక, ఇంట్లో పనిపాటలు బరువు వచ్చేస్తేను, ఎక్కడో పుర్రాల్లో వుండేవాణ్ణి, బలవంతాన పట్టుక వచ్చి, బంగారంలాంటి పిల్లను తెచ్చి ముడివేశారు. అయినా ఏంలాభంలె వాడి ముఖం చూడలేదు, వాడినామాలువాడు, మూడునామాల నంబరాయిలా,

వేంక: (ప్రవేశించి) కేశవా! మామగారు యేదో దంచేస్తున్నారు! ఎవరిగురించో!

కేశ . యింకెవరిని గురించి? మన అన్నమయ్యను గురించే!

వేంక· కేశవయ్యగారూ! మామయ్య బుద్ధి, మీకింకా బోధపడలేదనుకుంటాను

కేశ : అయ్యో, తెలియకేమి? బాగా తెలుస్తూనే వుంది, వూల్లో ఎవరి కాపురం బాగున్నా, యీ పుణ్యాత్మునికి అసూయఅని.

వేంక: ఆ! వచ్చినాయి యీయనకి యేన్కు, కాకికి వచ్చినట్లు. ఏంలాభం?

లింగ: (కోపంతో) విన్నావా! విన్నావా! కేశవయ్యా, వచ్చినాడో లేదో వీడు నన్ను కూసే కూతలు. వరేయ్! వెంకాయ్! చిన్నా పెద్దా లేకుండా, వెధవా! బెట్టంత మనిషిని నన్ను, కాకిలాగంటావా? నాకు కోపం వచ్చిందంటేను మనిషినిగాను తెలిసిందా? ఆఁ!

వేంక: ఏమి చేస్తావయ్యా? పిచ్చికుక్కవై కరుస్తావా? ఏమిటి?

కేశ: అయ్యా! వెంకయ్యా! మధ్యలో మీకెందుకయ్యా! యీ రభస? ఎవరింటి కోసమో వూరుకోండి, యెవరైనా చూస్తే!

వేంక: చూడనీలే! చూచి ఏమిచేస్తారు ?

లింగ: ఏమి చేస్తారా! నీ ముఖాన ఉమ్మివేస్తారు?

వేంక: ఏమి కూశావ్! నాముఖాన ఉమ్మివేస్తారా? నీదినోరు కాదురా! డొంక,

లింగ: (కోపంతో) విన్నావా! కేశవా! కాకి అన్నాడు, సహించాను, పిచ్చికుక్క అన్నాడు. సహించాను, నా నోరు డొంక అన్నాడు ఇక సహించలేను, వరేయ్! వెంకా! నిన్నూ నిన్ను ఏమ్ చేస్తానో తెలుసా (ఆవేశపడును)

వేంక: (మీదికిపోతూ) ఏమ్‌చేస్తావు? నీముఖం చేస్తావు

కేశ: (అడ్డుపోయి) ఆగు వెంకయ్యా! లింగమయ్యగారి విషయం మనకు తెలియదా? ఏమిటి?

లింగ: (మీదికిపోతూ) కేశవా! కేశవా! ఇక సహించలేను, వీడితో ఇన్ని మాటలు తిని పదిమందిలో నేనెలా తలెత్తి తిరిగేది? నీవు ప్రక్కకు తొలగు వీడికత, తేలిపోతుంది (కేశవులును ప్రక్కకు త్రోయును)

వేంక: కేశవా! వీడినోరు మూయిస్తాను, పొరుగువారి మంచితనాన్ని, ఐశ్వర్యాన్ని చూచి ఓర్వలేని వీనిబుద్ధికి గుణపాఠం చెపుతాను. ముందు నీవు అడ్డు తొలుగవయ్యా (కేశవయ్యను ప్రక్కకు త్రోయును)

కేశ: అయ్యా! ఎంత చెప్పినా, వినిపించుకో రేమిటి? మీకేవో పాతకచ్చలు ఉన్నట్లు అర్థమౌతుంది.

వేంక: ఛీ! ఛీ! వీడితో కచ్చలా?

కేశ: ఇదేంటి, కచ్చకాదా?

వేంక: కేశవా! వీడు పెద్దవాడని గౌరవింగాలి గాని, వీడి జీవిత మంతా, మన తాళ్ళపాకలోని ప్రతి యింటి సంసారాల, ఆడిపోసుకోవలసిందె, వీడికిదే పని మరేపనీ లేదు.

లింగ. అవునోయ్(వూరినంతా ఆడిపోడుకుంటాను. ఊళ్లోవాళ్ళకు లేని దురద నీకెందుకోయ్, నీవు మహామంచివాడ వయినట్లు,

వేంక: ఏమిటీ! నేను మంచివాడను గానా? ఏమి చేశానోయ్, చెప్పు,

లింగ: కేశవా! వీడు చెప్పమంటున్నాడు, చెప్పమంటావా?

వేంక: చెప్పవయ్యా! కేశవయ్యను అడగడం దేనికి?

లింగ· ఇదిగో చెప్పుమన్నానయ్యా! నీవు ఆ అన్నమయ్యగాడి యింటిలో ఆ తిమ్మక్కకెదురుగా ప్రతిదినము కూర్చుని కొలువుచేస్తూ వుంటివే? ఎందుకోయ్ యిప్పుడు చెప్పు,

కేశ : ఓరీ! నీబుద్ధి తగులబెట్టా? యిప్పుడర్థమవుతూ వుంది, నీ నీచపుబుద్ధి.

వేంక: చూచావా! చూచావా! ఇది వీడివరస, తిరుమలమ్మ యేనాడు లక్కమాంబగారి ఇంటికి, కోడలయిందో నాటినుంచి వీడు ఆయింటిపై చలపట్టాడు(

లింగ: అవునోయ్! ఆ తిమ్మక్క, ఆయింటికి వచ్చింది మొదలు నీవు మాత్రం ఆ అమ్మాయిని దినానికి ఒక్కక్షణ మైనా, చూడకుండా ఉన్నావా? ఇప్పుడు చెప్పు ఊ

వేంక: వరేయ్! ఆ మహాతల్లి, అన్నమయ్య యేదో సత్కాలక్షేపము చేస్తుంటాను, విందామని వెళుతుంటాను,

కేశ . అవునయ్యా! వారి సంభాషణ విన్న అన్నమెందుకు? హాయిగా అనందంగా కాలం జరిగిపోతుంది,

లింగ ఆహా! ఆహా! ఏమన్నావు వారి సంభాషణకంటె ఆమెను చూస్తుంటె అన కూడదూ, ఇద్దరూ తోడుదొంగలేగా!

వేంక· ఛీ! ఏమ్ కూశావ్?

కేశ : ఆగు వెంకయ్యా! లింగమయ్యా! నీకు నమస్కారము, వెళ్ళిపో, నీ మాటలు వింటూవుంటె నేను నీపై, వేయి చేసుకోవాలి, మేము పెద్దవాళ్ళం, నీకు మరీ నమస్కారం పెడతాను, వెళ్ళిపో,

లింగ: వరే! వెంకా! యీ నాడు యీ కేశవయ్య అడ్డు ఉండడంతో నీవు బ్రతికి పోయావు, లేకపోతే, యీపాటికి; నీవు యమధర్మరాజు వద్దకి, నేను శ్రీకృష్ణ జన్మస్థానానికి వెళ్ళియుండేవాళ్ళం, సరే! మరచిపోనురా! మరచిపోను, నన్నువరే! అంటావా! మరీ, నోటికి వచ్చినట్లు కూస్తావా? ఉండురా! ఉండు! యేదో ఒకనాడు నీకథ తేలుస్తాను! ఆ;

(వెళ్ళిపోవును)

వేంక: (యేమో చెప్ప బోవును)

కేశ : (నోరుమూయును)

లింగ: (వెంకయ్యవైపు కోపంగా చూస్తు బిరుసుగా వెళ్ళిపోవును)

కేశ : వెంకయ్యా! వీడితో ప్రొద్దుపోని వాదులాట ఎందుకయ్యా! వెళ్ళి పోయాడు, అతడొక పిచ్చిమనిషి (నిట్టూర్చి) ఇక పోనీలె; కాని ఒక మాట, అన్నమయ్య, ఇల్లు వదలిపోయాడట!

వేంక: (నిట్టూర్చి విషాదంగా) అవును కేశవా! వాడి జీవితం ఆ తిమ్మక్కతోనే! ఆమె పోవడంతో, వాడికి పూర్తిగా మతిపోయింది, ఎప్పుడూ, తిరుమలా! తిరుమలా! అంటూ కన్నీరు కార్చడం, వాడిని ఏమని ఓదార్చాలో? నాకు చేతకాకపోయింది,

కేశ : (నిట్టూర్చి) అలాంటి భార్యపోతే! ఎవడు మాత్రం బాధపడడు.

వేంక: అవును పైనుండి వానిని ఊరడించేవారమే కాని, బాధను పంచుకోలేముగా.

కేశ : అది ఎవరికి సాధ్యం? అయినా అతడికి ఇక్కడ మనసుకు స్థిమితము చిక్కదు, తిరుమలకి వెళ్ళడమే మంచిది

వేంక: అందుకే వెళ్ళిపోయాడు. లక్కమాంబగారికి, బంగారంలాంటి కోడలు పోవడం, మరీ కొడుకు ఇల్లు వదలిపోవడం, ఇంట్లో విధవకోడలుకూడా ఇల్లు వదలి అమ్మగారిల్లు చేరుకోవడం, మంచం పట్టిన భర్త, ఇవన్నియును గాక "గోరుచుట్టుపై రోకలిపో టన్నట్లు" ఆ తిమ్మక్క పోతూ ఒక కుమారుని గని, ఆ లక్కమ్మగారికి మరీ బరువుపెట్టింది, ఇప్పుడామెకు ఇంట్లో యమబాధగా ఉంటోంది.

కేశ : (విషాదంగా) వెంకా! అన్నమయ్య కాపురం ఎలా మారిపోయిందో చూడు? ఈ బాధలన్ని త్రోసిపుచ్చుకొని అన్నమయ్య తిరుమల కెల్లిపోయాడు. అతడే ధన్యాత్ముడు, ఎవరు భార్య? ఎవరు భర్త? ఎవరు పిల్లలు? నేను కూడా, యీ సంసారబంధాన్ని విడచి, తిరుమలవాసుని చెంతచేరి, జీవిత శేషమును ప్రశాంతంగా గడుప నిశ్చయించుకున్నాను

వేంక: నేనేనాడో, నిశ్చయించుకున్నాను బాల్యస్నేహితుని విడిచి ఉండలేను, కాని, పరిస్థితులు అనుకూలించడం లేదు. సరే! యేనాడెక్కడో, పదా,

(ఇరువురు నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)

# పదకొండవ సీను

(విష్ణుముని ఆశ్రమము)

అన్న : (విషాదంగా ఆశ్రమము ముందు కూర్చుని వుంటాడు)

విష్ణు: (ప్రవేశించి ఆశ్చర్యమున) ఎవరు? అన్నమయ్యా!

అన్న : (లేచి పాదములకు నమస్కరించును)

విష్ణు: అన్నమయ్యా! ఇదేమి? ఏదోవిషాద సంఘటన నిన్ను పీడించుచున్నట్లున్నది (లేపును)

అన్న : (బాధగా) గురుదేవా! జీవితమే తారుమారై పోయినది.

విష్ణు: నాయనా! ఆపదలయందు, ధైర్యముగా నుండుటయే ధీమంతుని లక్షణము. కష్టములందు బాధపడుటయు, సుఖములందు ఆనందపడుటయు, జ్ఞానవంతుని లక్షణముగాదు. కానిమ్ము ఇప్పుడు ఇల్లువిడిచి వచ్చితివా?

అన్న : స్వామీ! ఇల్లుతోటె. ఇల్లాలుకదా!

విష్ణు: నాయనా! నీమాటలు నాకు బోధపడుట లేదు

అన్న : స్వామీ!

అన్నివిదాల నాకు తగినట్లుగ దైవము భార్య నిచ్చె; నా
కన్నియు భోగముల్ క్షణము నందున మాయము నయ్యె. పత్నియే
కన్నులు మూసె; అంతయును గారడి విద్యయె. యేమి సేతు? నే
నన్ని విధాల దిక్కుసెడి అయ్యరో! వచ్చితి. మీదు చెంతకున్

(బాధపడును)

విష్ణు. నాయనా! యేల బాధపడియెదవు? భగవంతుడు, అంత వెర్రివాడు కాదయ్యా! ఆయనకు అన్నియు సమానమె: ఒకమాట నీభార్య చాలా పవిత్రురాలు, పుణ్యవతి. కారణభూతుడవైన, నీకొరకె, జన్మించినది, నిన్ను పెళ్ళియాడి, సుఖించి, కన్నుమూసినది. అట్లు తన జాతకమున నున్నది అది భగవదిచ్ఛ, కాని, నీవు చేయబోవు కార్యములు ఇంకా! ఎన్నో గలవు. అందులకే, ఆభగవానుడు, నిన్ను, భార్యావియోగిని జేసి, ఇటకు రప్పించుకున్నాడు,

అన్న: గురుదేవా! ఇప్పటి నాపరిస్థితిలో మీమాటలు, నాకేమీ బోధపడుట లేదు, నేను చేయదగుకార్యములన్నారు, నాతల్లిదండ్రులైన అలిమేలు

మంగమ్మను, శ్రీనివాసుల స్వామివారిని భక్తితో జపించుట తప్ప యిక యితర మేమియు నాకవసరము లేదు, మీరుకూడా నన్నట్లె దీవించండి గురుదేవా! (నమస్కరించును)

విష్ణు కుమారా!

అంతయు దైవమాయ, యెపుడాభగవానుడికేమి సేయునో?
అంతయు నాటకంబు గద! ఆ మహనీయుని నిర్ణయంబులో
నెంతయొ నీదుపాత్ర, మరి యెంతయొ నాదు చరిత్ర మయ్యా! యీ
వింతలు యేరికిన్ తెలియవే! యివియే గద దైవచిత్రముల్.

నాయనా! చాలా అలసిపోయి నట్లున్నావు. ఎక్కడ భోజనము గావించితివో? అన్నియు మరచి నీవు మునుపటిరీతి నీకార్యక్రమములో నిమగ్నుడవు గమ్మ, నీకంతయు శుభమే జరుగును, రమ్ము! పోవుదము

(ఇర్వురు లోనికి నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)



# పంద్రెండవ సీను

(సాళువ నరసింహరాయల సభ)

(రాజు, మంత్రి ఆసీనులై యుందురు)

(అక్కలమ్మ నృత్యము చేయుచుండ తెర తెరువబడును)

కీర్తన - రచన - అన్నమయ్య

అక్క: నీడల చూపులు నీకేలే యీ
వాడక వాడెడి వడ నీకేలే ॥నీ॥

నిలువుల నటనలు నీకేలే యీ
నిలుగుల నడపులు నీకేలే
నెలపుల కరఁగులు నీకేలే యీ
కులికెడి నునుసిగ్గులు నీకేలే ॥నీ॥

నెఱుల చెదరులివి నీకేలే యీ
నెఱవగు చదురులు నీకేలే
నెఱతనపు సిరులు నీకేలే యిదె
చెలగున మూసెదు సఖి నీకేలే ॥నీ॥

నిక్కపు బొంకులు నీకేలే
నిక్కల గంటివి నీకేలే
నిక్కితి వొరపుల నీకేలే యిదె
దక్కె వేంకటోత్తముఁ డింకేలే ॥నీ॥

అంద: (చప్పటలు కొట్టుదురు)

నర: అమ్మా! తమరెవరో గొప్పవారుగా నున్నారు, మరేలనో "అనాధనని" తెల్పి మాసాయము గోరవచ్చితివి, తమ గానమునకు, నృత్యమునకు, మేమానంద భరితుల మైతిమి. ఇక తమకోర్కెను తెల్పుడు,

అక్క: ప్రభూ! అనాధను తమ ఆశ్రయము గోరితిని,

నర: అమ్మా! నీవు నాకూతురి వంటి దానవు మా నెలవుననే నీవు ఏకొరతలు లేక నీయిష్టము వచ్చినంత కాలము ఉండవచ్చును,

అక్క: ధన్యురాలను ప్రభూ!

నర: **అమ్మా!** మీరు పాడిన కీర్తనను రచించిన మహానుభావు లెవరో? శెల వీయగలరా?

అక్క: ప్రభూ! పదకవితా పితామహులైన, అన్నమాచార్యులవారు,

నర : ఆహా! ఆహా! ఎంతచక్కటి భావకవిత, ఆమహనీయునకు మాధన్య వాదములు, అమ్మా! మీరు అంతఃపురమునకు వెళ్ళుడు, ఎవరక్కడ?

తెర : చిత్తము

నర : ఈమెను అంతఃపురమునకు తీసికొని పొమ్ము. రాణిగారితో, ఈమెను తనకన్నకూతురిలా చూడుమని మాయాజ్ఞగా తెల్పుము?

తెర : చిత్తము

నర : అమ్మా! మీరు అంతఃపురమున కరుగవచ్చును

అక్క: మహాభాగ్యము (నమస్కరించి నిష్క్రమించును)

నర : మంత్రీ! వింటిరిగదా! అన్నమాచార్యులవారి కవిత

ఆకలమందు నుప్పతిలు అమృత వాక్యములోని భావముల్
ఏకవి వేంకటేశ్వరుని నిట్లును వర్ణన సేయలేదుగా
యీకవినందుకే పృదివి నెంతయు కీర్తినిగాంచెనే కదా
ఆకరుణా మయుండపుడె ఆప్తుడనయ్యెను భక్తకోటికిన్,

ఆ మహనీయుని కవిత్వములో, ఎంత శృంగార రసము, ఎంత లయ బద్ధము, ఎంత భావము, ఎంత మధురమౌ పదలాలన, ఆహా! ఆమహనీయుని కవిత్వమున తిరుమల నిలయుడైన ఆ శ్రీనివాసుడు, అలిమేలు మంగమ్మ ఎంత ఆనందపడుచున్నారో? "అయ్యా! అన్నమాచార్యా! నీవు ఈ లోకమున ధన్యుడవు" మంత్రీ! ఆ మహాకవిని ఒకమారు మన ఆస్థానమునకు రప్పించి, వారి నోటనే, వారు వ్రాసిన కీర్తనలను పాడించుకొని, ఆనందింపకోర్కె కల్గినది, పిలిపింపుడు.

మంత్రి. ప్రభూ! మీకోర్కె ఫలించును, శ్రీ అన్నమాచార్యులవారు, దేశాటనము చేయుచు మన పట్టణమునకు నేడువచ్చి విడిదిచేసి యున్నట్లు తెలిసినది, ప్రభువులవారి అనుమతి ప్రకారము పిలిపింతును.

నర : సంతోషము, వెంటనేపిలిపింపుడు,

మంత్రి: చిత్తము, ఎవరక్కడ, రాజుగారి ఆహ్వానమని శ్రీ అన్నమాచార్యుల వారికి తెలిపి వెంటనే పిలుచుకొనిరండి.

తెర : చిత్తం

నర : మంత్రీ! నామనంబున, మరొక కోర్కె జనించినది.



నర : మంత్రీ! నామనంబున మరొక కోర్కె జనించినది.

మంత్రి: ప్రభూ! ఏమా కోరిక! తెలుప! తగినదియేనా?

నర: అన్నమాచార్యుల వారిని ఇటకు, రప్పించుచున్నాము గదా! వారితో, మనవంశముపై కొన్ని కీర్తనలు, వ్రాయించిన బాగుండునని.

మంత్రి: ప్రభూ! ఏమాకోరిక? తెలుప తగినదియేనా?

నర : అన్నమాచార్యులవారిని, ఇటకు రప్పించుచున్నాము గదా! వారితో మన వంశముపై కొన్నికీర్తనలు, వ్రాయించిన బాగుండునని- - - -

మంత్రి: వారు వ్రాయవలయునే గాని మీవంశమున నున్న, తర తరములవారు తరించి పోవుదురు. మీకీర్తి శ్రీ వేంకటేశ్వరుల కీర్తివలే దేశమందంతట ప్రాకిపోవును,

నర : ఆ మహనీయుడు, మావంశచరిత్ర వ్రాసిన,వారు కోరిన బహుమాన మంద జేయగలను,

మంత్రి. మీకోరిక వారికెరిగింతము,

తెర : ప్రభువులవారికి జయము, జయము, శ్రీ అన్నమాచార్యులవారు వచ్చుచున్నారు,

నర : మంచిది, మంత్రీ! ఎదురేగి ఆచార్యులవారిని ఆహ్వానింతమురమ్ము, (లేచును)

మంత్రి: మంచిది (లేచును)

(అన్నమాచార్యులవారికి ఇర్వురు ఎదురుపోవుదురు)

అన్న. (ప్రవేశము)

నర : అన్నమాచార్యులవారికి నమస్కారము (నమస్కరించును)

మంత్రి: కవులవారికి అభివాదములు (నమస్కరించును)

అన్న: (దీవిస్తూ) సుఖీభవ

నర :<br>మంత్రి: } (అన్నమాచార్యులవారిని పిలుచుకొని వత్తురు)

నర : దేవా! ఈ పీఠ మలంకరింపుడు, (ఉచితాసనము చూపును)

అన్న: మంచిది (కూర్చొనును)

నర : దేవా! మీదు ప్రవేశమే సభకు దేదీప్యంబులై వెల్గుచే
గావింపన్ బహు పుణ్యమౌ దినమిదే గాదేతలంపన్ సదా
గోవిందున్ తమరెట్లు గొల్తురో; యటే కూర్మిన్ మమున్ ప్రీతితో
దీవింపంగదె మాదుసేవగొని యీ దీనున్ దయన్ స్వామిరో!

మం : పదకవితామహా! అన్నమాచార్యా!

దేవ మహానుభావ మము దీవెనసేయుడు, మీదు సేవచే
పావనమయ్యె మా బ్రతుకు పావనరూప! త్వదీయ దర్శనం
బేవెలకైన చిక్కనిది, యియ్యది మీపదధూళి సోకినన్
బోవె మదీయపాపములు పుణ్యము మమ్ము వరించె నేటికిన్.

అన్న : భూపాలా! "విజయోఽస్తు" మీకు ధరణన్, పుణ్యాత్ములై మీరలున్,
గాపాడన్ దగుదీవు; మాధవుదయన్ కాలంబు సౌఖ్యంబునౌ,
మీ ప్రేమన్ గొనియాడి, మీ ప్రజలు, మిమ్మే గొల్తురే ప్రీతిగా,
నా పద్మావతి వేంకటేశ్వరులు మిమ్మాశీర్వదింపన్నదా!

నర :
మం : } దేవా! ధన్యులము, ధన్యులము

అన్న: మంచిది. మహారాజా! అతిత్వరగా మమ్ము తమ రాహ్వానించుటకు, కారణమేమియో? తెలపీయ వేడుచున్నాను,

నర : దేవా! ఆచార్యదేవా! చాలాకాలముగా, మిమ్ము మా సభకు ఆహ్వానింప వలయునన్న కోర్కె నాలో యుండినది, యీనాడది తలువని తలంపుగా సమకూడినది, యేమన ఒకపుణ్యాత్మురాలు మా సభలో, తమరు రచించిన కీర్తనను గానముసేయుచు నృత్యము గావించెను, అందులకు నేనే గాదు మా సభయంతయు ఆనందపరవశమై పోయినది, మేమామె గానమునకు నృత్యమునకు మెచ్చి బహూకరించిన తరువాత పాడిన కీర్తనను రచించిన మహానుభావు లెవరని యడుగ యామె మీపేరు చెప్పినది, అందుచే మిమ్ము రప్పించి మిమ్ములను తగినరీతి బహూకరించి పంప దలచి ఆహ్వానించితిమి, మరియు తమచు వ్రాసిన కీర్తనను తమరే స్వయముగా పాడి వినిపింతురని కోరిక

అన్న: ప్రభువులవారికి మాకీర్తనలు మానోట విన కుతూహలు రగుటయు మా అదృష్టమె!

మం : దేవా! మాఆస్థానము పవిత్రమౌను గదా!

అన్న: అంతా దైవలీల!

నర : స్వామీ! మున్ను యీసభలో మీకీర్తనను పాడి నృత్యము చేసిన అమెను పిలిపింతుమా! మీకీర్తనకు నృత్యము చేయును

అన్న: కానిమ్ము: మీకోర్కె యేల కాదనవలయును?
మం : ఎవరక్కడ, మునుపు మనసభలో కీర్తనను పాడిన గాయనిని ప్రభువుల వారాహ్వానించు చున్నారని, పిలుచుకొనిరండి,
తెర : చిత్తం
అక్క: (ప్రవేశించి, ఆచార్యులవారి పాదములకు నమస్కరించి తరువాత ప్రభువులకు నమస్కరించి నిలచును)
అన్న: (అక్కలమ్మను తదేకదృష్టితో జూచి నిట్టూర్చును)

(కీర్తన - రచన - అన్నమాచార్యులు)

ఏమొకొ చిగురు టధరమున
యెడనెడ కస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుకదా ॥ఏ॥

కలికి చకోరాక్షికిఁ గడకన్నులు కెంపై తోచిన
చెలువం బిప్పుడిదేమో! చింతింపరె చెలులు
నలువున ప్రాణేశ్వరుపై నాటిన యాకొన చూపులు
నిలువున బెరుకఁగ నంటిన నెత్తురు కాదుకదా ॥ఏ॥

పడతికి చనుమెఱుఁగులు పైపైఁ బయ్యదవెలుపల
కడుమించిన విధమేమొ కనుగొనరే చెలులు
ఉడుగని వేడుకతోఁ బ్రియు డొత్తిన నఖశశి రేఖలు
వెడలగ వేసవికాలపు వెన్నెల కాదుకదా ॥ఏ॥

ముద్దియ చెక్కుల కెలఁకుల ముత్యపుజల్లుల చేర్పుల
వొద్దిక లాగులివేమో వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి కాఁగిటి యధరామృతములు
అద్దిన సురతపు వేళల అందము కాదుకదా ॥ఏ॥

అక్క: (పాట కనుగుణంగా నృత్యము చేసి నమస్కరించి నిలుచును)
అంద (చప్పటలు కొట్టుదురు)
అక్క: (అన్నమాచారికి నమస్కరించి వెళ్ళును)
అన్న: (అక్కలమ్మ వెళ్ళిన వైపు చూచి నిట్టూర్చును)
నర : ఆచార్యదేవా! ఆనందము పరమానందము, మాజన్మలు ధన్యమయినవి!
అన్న: (చిరునగవున) నేను ధన్యుడనైతిని యిక నాకుసెలవా?

మం . స్వామీ! ప్రభువులవారి హృదయమున మరొక చిరుకోరిక గలదు.

అన్న: అయ్యా! అది నాచే నెరవేరునదియైన తప్పక తీర్చగలను

నర : స్వామీ! అన్నమాచార్యా!

మీరు రచించు కీర్తనలు మీపలుకందలి దివ్య భావముల్
చేరువ చేసె మీకునిటు శ్రీ అలుమేలును, వేంకటేశునిన్
వారివలెన్ మదీయ నృప వంశము గూరిచి కైతలల్లగా
గోరుచు నుంటి స్వామి మిము కూరిమి మాదగు కోర్కె దీర్చుమా!

అన్న: మహారాజా! మీకోర్కె చాలామంచిది, కాని నానియమము ఒక్కదానిని మీరు మన్నించాలి.

నర : తెల్పండి

అన్న: ప్రభూ!

దేహము స్వామిదయ్య మరి తెల్వియు గూడను, వారిదేను, నా
యూహయు, దైవచింతనలు నుప్రట లూగును, వారిగూర్చినే
నాహరి నామమే దలతు, నన్యము పల్క నటంచు దీక్ష నే
నాహృది నెంచి తెప్పుడును నన్యుల కీర్తిని పల్క నయ్యరో!

కావున క్షమించాలి, నన్నన్యదా భావింపరని తలంతును.

మం : స్వామీ! మీరు బాగా ఆలోచించండి.

అన్న: మంత్రిగారూ! నానిర్ణయము ఒక్కటే! నాకీర్తనలు నా ప్రభువులపైని ఆ అలిమేలు మంగమ్మ పైననేగాని ఇతరులను పొగడను, పొగడబోను

మం : అలాగైన ప్రభువులవారి నిర్ణయమును, త్రోసిపుచ్చెదరా?

అన్న: అంతా దైవలీల ప్రభువులు ఎంతటికైనా తగినవారు

మం : అన్నమాచార్యమహాశయా! ప్రభుకోర్కె నెరవేర్చక పోయిన, అది ప్రభుధిక్కారమై పోవును, కాన శిక్ష ననుభవింప, వలసియుండును.

అన్న: నేను ప్రభువుబంటుగాను, స్వామి బంటును.

మం : ప్రభువు పాలనలో నున్నవారందరు రాజునకు సేవకు లేనని మీరు తెలుసుకొనలేకున్నారు.

అన్న: నేను మాత్రము కాను.

నర : అన్నమాచారిగారూ!

సాళువరాయనాజ్ఞ యెటు సాగదొ? చూతము; మీకు సాయ మి
వ్వేళను నెవ్వరొత్తురోభువిన్ నరసింహుడు సింహమయ్యా! నే
తాళ సహింపజాల, నిను, దానవ కృత్యములందు చిక్కుచున్
హేళనగాకు, నీబ్రతుకు హింసల పాలగునయ్యా! స్వామిరో!

మా కోర్కె నెరవేరకపోతె జరుగబోవు శిక్ష మహా ఘోరముతెలుసా? పిచ్చి పిచ్చి వేషాలతో, దీక్షయని, నిర్ణయమని, మూర్ఖముగా ప్రవర్తించి, గౌరవమును పాడుజేసికొనబోకు

మం : స్వామీ! వింటిరా! మీకు జరుగబోవుశిక్ష మహాఘోరమని

అన్న: సాళువ నరసింహరాయా! తొందరపడకు,

ఎందరొ రాజు లేగిరి, మరెందరొ పోవను సిద్ధమై, యా
అందరిలోను మీరు నొక రయ్యరో! భక్తుల శక్తిదాటికిన్
పందెమువేసి, యా యముడు పట్టె మృకండునిపట్టి ద్రుంపగా
అందుకు నీశుడే యలిగి అయ్యమునిన్ వధియింప బోవడే?

కావున అన్నిటికి అ భగవంతుడే ఉన్నాడు. మీరెన్ని చెప్పినను నా నిర్ణయము మారదు,

నర : దేవుని సాకుచెప్పి నన్ను బెదిరించుచుంటివా? ఈ తాటియాకుల చప్పుళ్లకు జడియువాడు కాడు యీ సాళువ నరసింహ భూపాలుడు. నానిర్ణయము కూడా నిను కారాగారమున బంధించుటయె!

అన్న: సంతోషము, నాహితము మీకు యీసమయమున రుచింపదు

నర : ఆచార్యా! నిన్ను శ్రీ శ్రీనివాసుడు రక్షిస్తాడని ఆశతో, రాజాజ్ఞను దిక్కరించుచున్నారు. నిన్ను కారాగారమున బంధించి అన్నపానీయములను కూడా అందకుండా చేసిన అపుడు తెలియును, అ భగవానుడె మీకు సర్వసౌఖ్యములు గలుగజేయును

అన్న: (తనలో) భగవానుడా! ఏమిటీపరీక్ష? ఈ ప్రభువు తనను కీర్తింపుమని పల్కుచున్నాడు, మిమ్ము స్తుతించిన నోటితో కలుషాత్ములైన మానవులను స్తుతింపలేను, ఈ సమయమున నన్ను రక్షించు భారము నీదె!

నర : ఆచార్యా! పలుకకుంటివేల? మంత్రీ! వీరి నిర్ణయము మారదు, వీరిని బంధించి, చెరసాలయందుంచుడు

మం : చిత్తము, ఎవరక్కడ? ఆచార్యులవారిని బందించి కారాగారమునకు గొనిపొండు,

తెర : చిత్తం (ఇరువురు బటులు గొలుసులతో ప్రవేశించి, నిలుతురు)

అన్న. అమ్మా! నేరములేని నీసుతుని కారాగార మందుంతురో
యమ్మా! వేగమె శిక్ష వీరికిడి నా ఆర్తిన్ కృపన్ బాపవే
మిమ్మే నమ్మిన వాడనమ్మ, హృదిలో మీపాదపద్మంబులే
సుమ్మీ! కొల్చుచు నుందు నెల్లపుడు దాసున్ వచ్చి కాపాడవే
(కళ్ళు మూసికొనును)

నర : (నవ్వి) అన్నమాచార్యా! ఇప్పుడు నిన్నెవ్వరూ విడిపించలేరు, చూచితివా? యీ సాళువ నరసింహ భూపాలుని ప్రతాపము, భటులారా బందించండి,

భటులు: (ఒకరి చేతులను ఒకరు వారె బందింపబోవుచుందురు)

మం . ఓరీ! పిరికిపందలారా! ఆచార్యులవారిని బంధింపక తారాడుతూ ఒకరి నొకరు మీరే బందించుకొనుచున్నారు (వారివద్దనున్న గొలుసును తీసుకొని, తారాడుచూ వచ్చి, రాజుగారిని బంధింపబోవును)

నర : మంత్రీ! నీకేమైనా! మతిపోయినదా? నన్ను బంధించుచున్నావు?

మం : ప్రభూ! నాకనులు కనిపించడం లేదు, నా తల తిరిగి పోవుచున్నది, (గొలుసును క్రిందవిడచి తల పట్టుకొని బాధపడును)

నర : అయ్యో! ఇదేమిటి? నాదేహమున శక్తి తనంతటది క్షీణించిపోవు చున్నది. కదలను శక్యముకాకున్నది, హృదయమున యేదో బాధ వెల రేగుచున్నది, మంత్రీ! ఈబాద భరించలేను, ఇదియంతయు యీ మహ నీయుని ప్రభావమే (తూలుతూ బాధపడుతు) స్వామీ! అన్నమాచార్యా! అహంబావముతో మీకపకారము చేయదలచిన నన్ను క్షమింపుము తండ్రీ! క్షమింపుము (కాళ్ళబడి)

తెలియనివాడ మీమహిమ దేవ మిమున్ బహుషోక్తులాడి తత్
పలమును బొందితిన్ ఖలుని పాపిని దోషిని గర్వపోతు నన్
కలుష నటంచు నెంచకయె కావుము వీడను మీపదంబులన్
తలచి తరింతునయ్య వరదా! దయప్రోవవె, అన్నమయ్యరో!

మం : (క్రిందపడి తారాడుతూ వచ్చి అన్నమాచార్యుల పాదములు పట్టుకొని) స్వామీ! అన్నమాచార్యా! మీ మహత్యమును తెలిసికొనలేని హీనుని, నన్ను కాపాడుము దేవా! కాపాడుము

అనాడు ద్రౌపది ఆపద నినుగోర నాగి నక్షయపుఁజీర లొసగినావు
మొసలిబారికి జిక్కి మొరపెట్టు గజరాజుమొర విని యేతెంచి బ్రోచినావు
బాలుప్రహ్లాదుని భక్తికి మెచ్చుచు నృహరివై కడు నాదరించినావు
అడవిలో శిలయైన ఆ అహల్యనునీవు కాలిధూళి సృజించి కాచినావు

అట్టి నీపాదముల వీడ నింక స్వామి
మాదుతప్పిదముల సారె మాటుమయ్య
ఏడుకొండల శ్రీ వేంకటేశుడీవు
అయ్యరో మమ్ము బ్రోవు మాఅన్నమయ్య!

అన్న: అయ్యలారా! ఇదియంతయు, ఆ శ్రీనివాసులు శ్రీదేవిగారి మహిమ వారిని ధ్యానింపుడు.

అం: (అందరు లేచి చేతులు జోడించి నిలుతురు)

అన్న: జననీ! మీదయ శ్రీనివాసుని కృపన్ వాటింప శక్యంబహో,
నను నివ్వేళను గాచి కల్పతరువైనారే భువిన్ మీరలే
కొనియాడన్ సత మీఖలుల్ తమకు భక్తుల్ గాగ కాపాడరే
నను పాదంబులబట్టి వేడిరి యిటుల్ నాకోర్కె నాలింపరే

(కళ్ళు మూసికొనును)

అంద: (కళ్ళు మూసికొని యుందురు)

అన్న: (కళ్ళు తెరచి. అందరివంకచూచి) అయ్యలారా! కన్నులు తెరవండి, మీరు యదావిధి, ముందు రీతిగా నున్నారు

అంద: (కళ్ళు తెరచి, పరికించి, ఆనందమున అన్నమాచార్యుల పాదములకు మ్రొక్కుదురు)

అన్న: అయ్యలారా! లేవండి, మిమ్ములను యథావిది గావించినది నేను కాదు, ఆ శ్రీనివాసులు, అలిమేలు మంగమ్మ, వారిని, మీరు మనసున ధ్యానింపుడు, మీకన్ని విధముల మేలు జరుగును

పర: స్వామీ! అన్నమాచార్యా! ఆ శ్రీనివాసులు, శ్రీదేవి, మాకు కనిపింపరు మాకు ప్రత్యక్షముగా కనిపించెడి దేవులు మీరు, మమ్ము మీ భక్తులుగా జేసికొని దీవింపుడు

అన్న: అయ్యలారా! మీరు నాకు భక్తులుకారు, మనమందరము శ్రీ వేంకటేశ్వరుని భక్తులము. లెండు

అంద: (లేచి నిలచి చేతులు జోడించి యుందురు)

(తెర వ్రాలును)

# పదమూడవ సీను

(కొండల సీను)

(పాటతో ప్రవేశము)

పాట

హరి : మా దేవుడెవరయ్యా మాదవదేవా
మాది ప్రాణముకాదా మమ్మూ మరచితివా! ॥మా॥

కులముల నీవే కోరిపెట్టితివా, మా
కులమూ నీచమంచు గుమిగూడి జనులు
యిలలోన మమ్మూ దూరముంచి రేమయ్యా
తలపగ నీకిది నాయమా సామి - ॥మా॥

దేవుడులేకయే దేహము లేదందురే
దేవుడొక్కడె పాణికోటిలయందురే
దేవుని మేముగన దోసమందురేల సామి
దేవుడే మాజాతికి లేడెందుకయ్యా ॥మా॥

తిరుమలలోన నీ గుడియున్నదంట
మరులాయె, నినుజూడ మనసున దేవ
కరుణతో నను నీకడ చేర్చుకోవ
పరుడనుగాను నీపదదాసూనయ్యా ॥మా॥

తడబడుచుండె, నానడకయు తండ్రి
నడువగలేనూ నా ఒడలూ అలిసేనయ్యా
చూడగలేనా నీగుడిలోన విన్నూ
కడజాతివాడ నన్నెడము సేయకుమయ్య ॥మా॥

(ఆయాసమున కూర్చొనును) దేవా! నిన్ను బీదలపాలిటి దేవుడవని లోకులందురె, దీనుడనైన యీ మాలవానిపై కరుణించి ఆదుకోలేవా? (పిచ్చిగానవ్వి) నీచే పుట్టింపబడిన జనులు నా కులమును అంటరానిదని, నియమముంచి దూరముగా తోయుచున్నారు, గుడియంటె ఎట్టిదో, గుడిలోని దేవుడు యట్టుంటాడో, కల్లారా సూసి, ఆనందించు బాగ్యము మాజాతికి లేదా సామి పానముపై ఆశవిడచి నీదగ్గరచేరి నీపాదముల

మీదపడి నాలోని అనుమానాలను, తీర్చుకొన వచ్చుచుంటిని (నిట్టూర్చి బాధగా) కాని, నీకొండ నెక్కడం యింత కష్టమని తెలియదుస్వామీ!

(బ్రాహ్మణుడు, కమండలముతో ప్రవేశించును)

బ్రా : అయ్యో! నాయనా! ఎవరు నీవు? ఎక్కడ వెళ్ళుతున్నావు?

హరి : సామీ! మీరు దూరముగా వుండుడు, నేను కడజాతివాడను, నన్ను తాకిన మీరు మైలపడిపోతారు.

బ్రా : (నవ్వి) అయ్యా! మీరన్నమాటలు నిజమె కాని, నేనందరిలాంటి బ్రాహ్మణుడను కాను, నాకీ ప్రపంచమున నున్న ప్రాణులన్నియు సమానములె! నాకు కులము, మతము అనుభేదములు లేవు, శుచిలేదు, అశుచిలేదు, మడుగులేదు, మైలలేదు, మీరు తిరుమలలోనున్న దేవుని చూడను బోవు చున్నారుగదా?

హరి : (వింతగాచూచి) సామీ! మీరు సామాన్యులు గారు, యీ కలియుగమున ప్రత్యేకముగా కనిపించుచున్నారు

బ్రా : నాయనా! నీముఖము వాడిపోయినట్లున్నది, అలసిపోయినావు, దప్పి తీర్చుకుందువా? కొంత శ్రమతగ్గును! తరువాతా, కొండపైకి మెల్లగ ప్రయాణముచేసి దేవుని చూడవచ్చును.

హరి : (ఆశ్చర్యమున) అయ్యా! మీరెంత మంచివారు, కాని మీరు నన్ను తిరుమల దేవలములోనున్న దేవుని చూడమంటున్నారు కడజాతి వాడనైన నన్ను, అక్కడున్నవారు ఆ గుడిలోనికి పోనిత్తురా! దేవుని చూడనిత్తురా? అని అనుమానము

బ్రా : నాయనా! అంతా దైవలీల, యీనిర్జన ప్రదేశమున నీకెట్లు నీళ్ళు లభ్యమగుచున్నవయ్యా! అట్లే ఏమహనీయుడో నీకు సాయపడగలడు, ఆ స్వామిని దర్శింతువు ఇదిగో నీరు త్రాగుము,

హరి : స్వామీ! మీరు నిజముగా! ఆపదలయందు ఆదుకొనెడి, ఏడుకొండల వానివలె నున్నారు (నీటికొరకు దోసిలిపట్టును)

బ్రా : (నీరుపోయును)

హరి : (నీరుత్రాగి) స్వామీ! మీరెపుడు, నాప్రాణములు కాపాడితిరి,

బ్రా : నాయనా! మీవోటివారికి, యీలాటి సాయము చేయుటకన్న మరొక పుణ్యము లేదు, వస్తాను,

హరి : మంచిది సామీ! (నమస్కరించును)

బ్రా : (నిష్క్రమించును)

హరి : (బ్రాహ్మణుని వైపు చూస్తూ) ఈ మహనీయుడు నిజముగా! ఆ ఏడు కొండలవాడె, భక్తులను ఆగోవిందుడు ఆదుకొంటాడని జనులు అను కుంటారు ఈనాడు అట్లే జరిగినది (బ్రాహ్మణుడు వెళ్ళినవైపు చూస్తూ చేతులెత్తి మ్రొక్కి) సామీ! మీరెవరో? మీకు నూరేళ్లాయువు, ఆ వేంకటేశ్వరసోమి గలిగించుతాడు, సోమీ! అడుగడుగు దండాలవాడా! (మెల్లగ నడచి ఆశ్చర్యంతో) ఏమిటి? ఎంత సులువుగా వుండిపోయాను? సామీ! అంతా నీదయ, గోవిందా! గోవింద, (నిష్క్రమించును)

(తెరవ్రాలును)





అన్న: ఆముఖమందమున్ మరియు

ఆకనులందము-ఆమె సొంపులున్

ఆమధురంపు పల్కులును

ఆనడయాడినయాడుగౌనుఁ హా

నామదిలోన హత్తుకొనె

నాదగుతిర్మలదేవివోలెనే

ఆమెయునెవ్వరోఁ తెలియ

దాయెను చిత్తము నిల్చెయామెపై.

అక్క: అయ్యా! అనాదను

విష్ణు: ఇది అనాథ ఆశ్రమము గాదమ్మా, మీరు పొరబడలేదనుకుంటాను, ఇది విష్ణుముని ఆశ్రమము

అక్క: స్వామీ!

తెలియదె! ఆశ్రమం బనుచు; దిక్కును దోచక వచ్చితయ్య, నా
ఫలిత మదేమొ? దైవ మిటు పంపగ వచ్చితి, స్వామి! యిందు నా
వలనను దోష మున్నయెడ వచ్చిన దారిని వెళ్ళిపోదునే,
తెలుపరె చిన్నదాన! తమ దీవెన గోరితి, చాలు నాకికన్

అన్న: గురుదేవా! ఈమె మంచి చదువరిలాగున్నది,

విష్ణు: ఈమెన్ గాంచ విచిత్రముగా నున్నదికాని. అమ్మా!

వయసున చిన్నదానవిటువచ్చిన కారణ మేమొ? తెల్పు; మా
దయకును పాత్రురాలవయి చాపున జేరితి వీవు, అమ్మ! యే
మియు మది సంశయింపకుము; మీకును మాదగు జేయు సాయ మే
దయినను జేతుమే! సుగుణ ధాముడు స్వామియు నున్నవాడులే!

అక్క: (పాదములు పట్టుకొని) తండ్రి! ధన్యురాలను,

మీపాదంబుల బట్టి వేడెదను, స్వామీ, విష్ణు మౌనీశ్వరా!
నాపూర్వం బొనరించినట్టి ఫలమేనన్ జేర్చె నిచ్చోటికిన్
మీపొంతన్ దయ చోటు నాకిడినచో మీసేవలన్ జేయుదున్,
ఓ పూజ్యుండ, హృదిన్ గలట్టి దిది, నా యుద్దేశ్యమున్ తెల్పితిన్.

అన్న: (ఆశ్చర్యమున) గురుదేవా! ఈమె యుద్దేశ్యము మంచిదిగా దోచదు, యీనాడేదో, మన ఆశ్రమమునకు మహాప్రళయము రానున్నదని భావింతును.

విష్ణు: (నవ్వి) ప్రళయమా? ఏలనయ్యా?

అన్న: ఆశ్రమమున ఆడవారున్న, ఎన్నో అనర్థములకు దారితీయును

విష్ణు: అవునయ్యా! వారు వేరుగా వుండక మనలో ఒకరై యుండిన?

అన్న: గురుదేవా! మీమాటలు నాకేమీ గోచరించుట లేదు

విష్ణు: నాయనా! అంతా దైవలీల! యీమె యెవరో తెలియదు, తనకింత చోటు కలిపింపసేయుమననేకాని, నిర్బంధించుట లేదు కదా? పైగా దిక్కు లేని దానవని తెల్పుచున్నది.

అక్క: స్వామీ! నిజముగా, దిక్కులేని దానను, అభాగ్యురాలను, అనాధను, పైగాకన్నియను,

విష్ణు: అమ్మా! మీరు దిక్కులేని వారని, మీదీనత్వమే తెల్పుచున్నది, మాలో ఒక్కదానివిగా, నీవు ఇక్కడే వుండుము అంత యు దైవమాయ.

అన్న: గురుదేవా! మీరాలోచించియే ఈ నిర్ణయం తీసుకున్నారా!

విష్ణు. అయ్యా! ఇదియంతయు ఆ శ్రీనివాసుని నాటకమువలె నున్నది లేకున్న ఊహించకయె ఇట్లు జరుగదు, కావున నీవీకన్నియను వివాహమాడి సుఖించుము, పదకవితా సార్వభౌముడవై, కీర్తి పతాకమును ఈఇలపై ఎగురవేసి వెలుగొందవలయునని, ఆ వేంకటేశ్వరుని ఆశయ మున్నట్లున్నది, అందుకు మీకు మరింత మందిని తోడు కల్పించు చున్నాడు "ఎప్పుడు ఏమి జరుగవలయునో అదిజరుగక మానదు" యిక నీవు నిశ్చింతగా యీ కన్యకామణిని చేపట్టి ఒక యింటివాడవు గమ్ము. అమ్మా! నీపేరు మేము ఇంతవరకు తెలసుకొనలేదు,

అక్క: స్వామీ! నన్ను అక్కలమ్మ. అంటారు కాని, తమరేపేరు యిష్టపడి పిలచినను సరియె,

విష్ణు: అమ్మా! అక్కలమ్మా! నీజన్మకూడా చరితార్థమైనది తల్లీ! పదండి మీ రిర్వురు శ్రీ వేంకటేశ్వరుని సన్నిధిలో వివాహమాడి సుఖింతురుగాక

(అందరు నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)



# పదునైదవ సీను

(గోపురము)

(వెంకయ్య కేశవయ్య! మాట్లాడుకుంటూ ప్రవేశం)

వెంక. కేశవయ్యా! వారం దినాలుగా గుడివద్దకు రావడంలేదు?

కేశ : తాళ్ళపాకకు వెళ్ళివుంటిని వెంకయ్యా!

వెంక. వూళ్లోను, మా ఇంటిలోను అంతా బాగున్నారా!

కేశ : అందరు బాగున్నారు, పైర్లు బాగున్నాయి

వెంక: మన అన్నమాచారిగారి యింట్లోను?

కేశ : (నిట్టూర్చి) యేముంది, ఇక్కడ యీనేమో తన దేవునిపై కీర్తనలు పాడుకుంటూ వేంకటేశ్వరునిలో ఐక్యమై హాయిగా ఉండిపోయాడు, అక్కడ లక్కమ్మగారు ముసలిభర్తతోటి తిరుమలమ్మకన్న చిన్న పిల్లవాడితో, పొలం పనులతో, ఇంటి పనులతో ఒక్కటె యమబాదలో వుంది

వెంక: (నిట్టూర్చి) అంతా దైవమాయ. ఈ వేంకటేశ్వరుడు, ఆ లక్కమ్మగారిని పరీక్ష చేస్తున్నాడు,

హరి : (తెరలోనుంచి) ఏడుకొండలవాడా! యే! వేంకటరమణా! గోవిందా! గోవింద (అంటూ ప్రవేశించును)

కేశ : నాయనా! ఎవరు నీవు?

వెంక: అయ్యా! వాడివాలకం కనిపించడం లేదూ? "నాయనా! ఎవరు నీవు" అంటున్నావు?

కేశ : (దూరముగా సర్దుకుంటూ) నాయనా! మీరెవరైనా సరె, కొంచెము, కొంచెము, దూరముగా ప్రక్కనుండుము, యిదో మా అబ్బాయి అడిగే ప్రశ్నకు సమాధానమివ్వు? నేనిప్పుడే స్నానంచేసి వస్తున్నాను. తిరిగి స్నానంచేయలేను

హరి : (పలుకకుండును)

కేశ . ఏమయ్యా! సమాధానమివ్వక గ్రుడ్లు మిటకరిస్తూ అలాగె నిలుచున్నావు?

హరి : అయ్యా! నాపేరు, "దాసు" అంటారు,

వెంక: నాయనా! దాసువా! తండ్రీ! ఎవరి దాసుడవు?

హరి : హరిదాసుడను,

వెంక: హరిదాసుడు! అంటే కాలబడి, హరిశబ్దానికి, నానార్థాలున్నవి

కేశ: అవునవును ఉన్నవి, ఉన్నవి

హరి: సామీ! నేను మాలదాసరిని, నాకు హరి అంటె, చాలా ఇష్టం అందుచే నన్ను అందరూ "హరిదాసూ", అంటారు,

వెంక } కేశ } (బట్టలు సర్దుకుంటూ దూరంగా వెనుకకు జరుగుతారు)

కేశ: నేననుకున్నానయ్యా! అనుకున్నాను. నీ వాలకం జూచి నీవు మాలవాడవై యుంటావన్న నా యూహ నిజమైనది,

వెంక: నాయనా! నీవు చాలా పొరపాటు పని చేశావయ్యా! దాసూ: మాలలు ఇక్కడకు రాకూడదు, త్వరగా యీ ప్రాంతం వదలిపో,

హరి: పంచివి స్వామీ! తొందరగా స్వామిని జూచి పోతాను, గోవిందా! గోవింద, (ముందుకు నడువబోవును)

వెంక } కేశ } (చెవులు మూసుకొని) కేశవా! కేశవా!

వెంక: అయ్యో! నీవు ఆ భగవంతుని నామమును, ఉచ్చరించకూడదు, అపచారం, అపచారం, (లెంపలు వేసుకొనును)

కేశ: నాయనా! స్వామి పేరు ఉచ్చరించడమే తప్పంటేను, దేవుని చూడాలంటావు, ముందు నీవిటునుండి కదులు

హరి: అయ్యా! నేనెంతో దూరమునుండి కష్టపడి వచ్చితినయ్యా!

వెంక: అవును, రాకేమయ్యా! బాగానే వచ్చావు కాని, ముందు కదులు

హరి: అయ్యా! దేవుని చూడనిదే నేనిటునుండి కదలను.

కేశ: ఓహో! చాలా గట్టివాడవే నరేయ్, అయ్యా! మీరు ముందుగా, మర్యాదగా కదలడు, (లోపలికెళ్లి కఱ్ఱతెచ్చును)

వెంక: ఆహా! నీకెంత పొగరురా! ఛండాలపు వెధవా? ముందు యిటునుండి కదులూ! ఊ

కేశ: (కర్రతో బెదరిస్తూ) వరేయ్, వరేయ్, కదలవా? అయ్యా! మీరు ప్రక్కకు తొలగండి, దీనిఫలితం పడతాడు, ఛాండాలపు వెధవా! (ముందునకు వచ్చి) వరేయ్! దాసూ! యీ పవిత్రమైన స్థలాన్ని, అపవిత్రం చేస్తావా? ముందు, నీవిక్కడ నుంచి కదిలావా? సరేసరి, లేదా? ఇదో యీ కర్ర చూశావా?

వెంక: 'చూబావా!' అంటు, కర్ర చూపిస్తావేమిటయ్యా! ఒక చురక చరచక, దానితో వాడె పరుగులు తీస్తాడు,

కేశ : ఓరీ, నీవిటనుండి కదలవా? ద్వారం మూయాలి,

హరి : (ముందుకు నడుస్తూ) ఏడుకొండలవాడా! గోవిందా! గోవింద,

వెంక. అయ్యో! అయ్యో! (చెవులుమూసికొని) వెంకటరమణా! వేంకటరమణా! వీడింకా ముందుకు నడచుచున్నాడయ్యా! దేవాళయం అపవిత్రమై పోతోంది, దేవా! వైకుంఠవాసా! వేంకటరమణా! (చేతులెత్తి గట్టిగా అరచును)

హరి (గట్టిగా అరచుచు) యేడు కొండలవాడా! యేంకటరమనా! గోవిందా! గోవింద, (ముందుకు నడచును)

కేశ : (గట్టిగాఅరచుచు) తలుపులు మూసేయండీ! తలుపులు మూసేయండీ! ఛాండాలుడు, దేవుని గుడిలోనికి ప్రవేశించుచున్నాడు, మూసేయండీ! మూసేయండి !

హరి : గోవిందా! గోవింద, (గుడివైపునకు నడచును)

కేశ : వరేయ్! చెపుతుంటె, మరీదేవుని నామము ఉచ్చరిస్తూ ముందుకు నడుస్తావా? ఛాండాలపు వెధవా! (కర్రతో తలపై కొట్టును)

హరి : (తలపట్టుకొని తూలుతూ) దేవా! యేడుకొండలవాడా! యేంకటరమనా! గోవిందా! (క్రింద పడిపోవుచుండును)

అన్న (పెళ్ళికొడుకు వేషమున పరుగున గుడిలోనుండి ప్రవేశించి దాసుని పట్టుకొని క్రింద పరుండపెడుతూ) అయ్యలారా! ఎంతపని చేసితిరి (పరుండబెట్టి దాసుతలను తనయొడిలో యుంచుకొనును)

వెంక. (ఆతురతో ముందుకువచ్చి) స్వామీ! స్వామీ! అన్నమాచారిగారు, ఆగండి ఆగండి, వీడు ఛండాలుడయ్యా? మీరు శుభమా అని పెళ్ళిచేసుకొని వచ్చుచున్నారు, వీడిని మీరు తాకకండి,

అక్క. (పెళ్ళికూతురు వేషమున ప్రవేశించి సమీపించి పైవెరగు చింపి హరిదాసు తలపై గాయమునకు కట్టుకట్టును)

విష్ణు: (ప్రవేశించి ఆశ్చర్యమున) ఆహా, యీఅక్కమాంబ ఎంత దయామయురాలు, ఎంతపుణ్యాత్మురాలు,

మును గోపాలుని చేతిగాయమునకున్ పుణ్యాత్ము రా లొటచే
తనపైకొంగును చింపి ద్రౌపది యెటుల్ తాచుట్టెనో యట్టులే
కనిపించున్ గద యీామె, యీాతడెవరోకానీ తరించెన్ భళీ,
మును నాపుణ్య పలంబునన్ పరిణయంబున్ వీరికిన్ జేసితిన్
అహో; ఈదినము మహా పవిత్రమైనది

కేశ: స్వామీ, అన్నమాచారిగారూ? మీాకు తెలియదేమో వీడు, అంటరాని వాడు స్వామీ, మీారంటరాదు,

అన్న: (బాదగా! అందరివైపు జూచి) అయ్యలారా! మీారు కులమనే రాక్షసి కబంధహస్తాలలో చిక్కియున్నారు, అయ్యలారా! కులమనగా ఏమిటో మీాలోఎవరికైన తెలుసా!

కీర్తన - రచన - అన్నమాచారి

ఏకులజుఁడేమి ఎవ్వఁడైన నేమి?
ఆఁకడ నాతడె హరి నెఱిఁగిన వాడు ॥ఏ॥

పరగిన సత్య సంపన్నుఁడైన వాడె,
పరనింద సేయఁ తత్పరుఁడు గానివాడు
అరిదైన భూత దయానిధి యగువాఁడె
పరులు దానెయని బావించువాఁడు ॥ఏ॥

నిర్మలుఁడై యాత్మ నియతి గలుగువాఁడె
ధర్మతత్పర బుద్ధిఁ దగిలినవాఁడు
కర్మ మార్గంబులు దడవనివాఁడె
మర్మమై హరిభక్తి మలవనివాఁడు ॥ఏ॥

జగతిపై హితముగాఁ జరియించువాడె
పగలేక మదిలోన బ్రతికినవాఁడు
తెగి సకలము నాత్మఁ దెలిసినవాఁడె
తగిలి వేంకటేశ దాసుఁడయిన వాఁడు ॥ఏ॥

అయ్యలారా! ఎవడేకులమైనను, ఏమతమైనను, అంతా మనలాటి మానవులే యని తెలిసికొనలేని మూఢులు, అజ్ఞానులై పోయారు, మీారు యీాతనిని హింసించుట మహాపాపము, శ్రీనివాసా! నీగుడి ప్రాంగణమున నీ భక్తులు కులమను పేరున మరో నీభక్తుని హింసించుచుండ నీవు

కనలేదా? స్వామీ! ఇట్టి యీ మతపిచ్చి వారికి జ్ఞానబోధను చేయుము తండ్రీ!, జ్ఞానబోధను చేయుము, అయ్యలారా!

కులమన నేమో? పూజ్యులను కోరితి మిమ్ముల చెప్పు రయ్య! యే
కులమున నుద్భవించిరి ముకుందుడు శంభుడు, బ్రహ్మలాదిగా!

(అందరివైపు చూచును, అందరు తలవంతురు)

పలుక రదేల? విష్ణునకు పాపలు గారొకొ సర్వులనే బువిన్
తెలియద, మీకులంబు లెటు దీర్చిరో, మానవకోటి? అయ్యరో,

అయ్యలారా! యీనాడు మనమందరము యీ ఏడుకొండలవాసుని, వేంకటరమణుని, దర్శించి "స్వామీ! బ్రహ్మ క్షత్రియ, వైశ్య, శూద్ర, మాల, అను తెగలవారిని నీవే నిర్ణయించితివా? మానవులలో అంటరానిది, అదెట్టిదో అని అడుగుదాం పదండి, (అందరివైపు చూచును)

అంద (ఒకరివైపు ఒకరు చూచుకొందురు)

అన్న: మీరు పలుకరు, గుడిలో నున్న ఆ మహనీయుడు, మొదలే పలుకడు, యీ సర్వ పిపీలికాది జీవరాసులన్నియు, ఆ మహనీయుని సంతతియె, కావున ఆయన ఎవరిని అధోగతికి ద్రోయడు! ఆయన కందరును సమానులె, మనమందరము వెరివారమై, మానవజాతిలో, మతభేదము, కులభేదము, ధనభేదము లుంచుకొని, తోటి మానవుని, ద్వేషించు చున్నాము, కాని మనమందరము ఆదేవునికి బిడ్డలము. అందరికిని ఆ దేవుని దర్శించు హక్కు కలదు, భక్తే ఆయనను పొందే మార్గము, ఆయన సంకీర్తనే భక్తి మార్గము, కావున పదండి, ఆ దేవుని దర్శించి, ధన్యులము గుదము,

అంద. (అన్నమాచారి పాదములపై బడుదురు)

విష్ణు: ఆహా! యీమహనీయుడు, ఎంత ప్రభావము గలవాడు ఇట్టి పరాత్పర స్వరూపుడు, నాకు శిష్యుడగుట నేజేసిన పుణ్యము.

హరి: (మెల్లగలేచి అందరి వైపుచూచి ఆనందమున) స్వామీ! మీరెవరో తెలియదు కాని

అలిమేలమ్మయు శ్రీనివాసుడును నన్నాప్యాయతన్ జూచి న
ట్టులః మీరిర్వురు నన్ను ప్రేమగని యిట్టుల్ సేవలన్ జేసి నా
రిల మీ సేవను బొంది నేసురలతో నేకత్వమున్ గొంటి, మీ
చెలికారంబు ఘటిల్ల, నన్ను మరపించెన్ వేంకటేశన్, ప్రభూ!

(పాదములను కౌగలించుకొనును)

అన్న: (ఆప్యాయతతో లేపి) అయ్యా! అంతమాటనకండి ఆమహనీయుని, కరుణాకటాక్షముననే, యీ ప్రపంచ మంతయు, నడుపబడుచున్నది, ఆపద సమయములందు ఆదరించువారు దేవతలవంటి వారని పొగడుట మన అలవాటు పదా! పరంధాముడైన ఆ వేంకటరమణుని అందరము దర్శింతము

(అందరు దేవునిగుడిలోనికి నిష్క్రమింతురు)

(తెర వ్రాలును)



# పదహారవ సీను

(విష్ణుముని కుటీరము, పూజామందిరము)

కీర్తన - రచన - అన్నమాచార్యులు

అన్న : మేదిని జీవులఁ గావ మేలుకోవయ్యా!
నీదయే మాకెల్ల రక్ష నిద్రమేలుకోవయ్యా ॥మే॥

తగు గోపికల కన్నుదామరలు వికసించె,
మిగుల సూర్యనేత్రుఁడ మేలుకోవయ్యా!
తెగువ రాక్షసులనె తిమిరము విరయఁగ
నెగడిన పరంజ్యోతి నిద్రమేలు కోవయ్యా! ॥మే॥

ఘనదురితపు నల్లఁ గలువలు వికసించె
మినుకు శశివర్ణుఁడ మేలుకోవయ్యా
పనివడి వేదాలనే పక్షులెల్లాఁ బలుకఁగ
జనక! యాశ్రిత పారిజాత, మేలుకోవయ్యా ॥మే॥

వరలక్ష్మి కుచ, చక్రవాకము లొండొంటి రాయ
మెలయు దోషారహిత మేలుకోవయ్యా!
పొరసి నీవు నిత్య భోగములు భోగింప
నిరతి శ్రీ వేంకటేశ నేఁడు మేలుకోవయ్యా: ॥మే॥

(మంగళహారతి యిచ్చి కళ్ళ కద్దుకొని నిలచును)

విష్ణు: (ప్రవేశించి) నాయనా! అన్నమాచార్యా! పూజ పూర్తియైనదా?

అన్న : అయినది స్వామి, హారతి తీసికొనుడు (హారతిని దగ్గరకు తీసుకొని వెళ్ళును)

విష్ణు: (హారతి తీసుకొనును)

పురం: (తెరలో పాటపాడుతూ ప్రవేశము)

కీర్తన - రచన - పురందరదాసు

దేవకి నందన ముకుందా
వందిత మునిగణ। నిత్యానంద। ॥దే॥

నిగమోద్ధార। నవనీతచోర।
ఖగపతివాహన! జగదుద్ధార।
మకరకుండలధర। మోహనవేష।
రుక్మిణీవల్లభ। పాండవపోష, ॥దే॥

వరవేలాపుర। చెన్న ప్రసన్న।
పురందరవిఠల। గుణపరిపూర్ణ। ॥దే॥

విష్ణు: పురందరదాసుల వారికి నమస్కారము
పురం: శుభమస్తు, మునిదేవా!

ఎన్నోనాళ్ళుగ మిమ్ముజూడమది కోర్కెనాడు సిద్ధించె నా
కన్నన్ ధన్యుడుకల్గడీ జగములోనయ్యా మిమున్ గాంచియున్
కన్నుల్ చేసిన బాగ్యమే యిదికదా కారుణ్య రత్నాకరా
మున్నే చేసిన పుణ్యమె, యికనిదే మోక్షార్హుడన్ గానొకో

విష్ణు. అయ్యా! ఈ దినము మహోన్నతమైనది, కూర్చొనుడు (ఉన్నతాసనము చూపించును)
పురం: (కూర్చొనును)
విష్ణు: ఈ దినము కొరకే నేనెదురు చూచుచుంటిని. నాయనా। అన్నమాచార్యా! వీరు పురందరదాసులు. పరమ భాగవతోత్తములు, పండరినాద భక్తులు
అన్న: పరమ భాగవతోత్తములగు పురందరదాసులకు అభివాదములు (నమస్కరించును)
అక్క: (నమస్కరిస్తూ) పూజ్యులకు నమస్కారము (ప్రవేశం)
పురం: దంపతులకు, శుభమగుగాక, ఎంతోకాలము నుండి, మిమ్ము దర్శించి దన్యునిగానెంచ హృదయ ముర్విళ్ళూరుచుండినది, నేటి కాకోర్కె తీరినది, ధన్యుడ నైతిని దేవా। దన్యుడ నైతిని ప్రభూ! (చేతులు జోడించుచు)
అన్న: దేవీ! అక్కూ! స్వామివారి పూజకు సామాగ్రిని తీసుకుని రమ్ము.
అక్క: చిత్తం (నిష్క్రమించును)

అన్న. సంగీత సాహితీనిధీ! యీనాడుకదా! మా కుటీరము పావనమైనది,

అక్క. (తట్టలో పూలు, చెంబు ఉంచుకొని ప్రవేశం)

అన్న: (తట్ట నందుకొని, పురందరుని పాదముల ముందుంచి కూర్చుని, పాదములపై చేతులుంచును)

అక్క. (నీళ్ళు పాదములపై బోయును)

అన్న. (పాదములు కడిగి, తడిని పైపంచతో తుడిచి, పాదజలంబును తన తలపై జల్లుకొని, అక్కలమ్మపై జల్లి పాదములపై పూలుంచి) దేవా! శ్రీ పాండురంగవిఠలా! పండరినాదా! నేడు పూజ్యులైన పురందరదాసు ఆకృతిలో, మాకు దర్శనమై మా జన్మములు పావనము జేయ, చను తెంచితివా, విఠలా!

ఇలపై జన్మము నొంద కంటి సుకృతం బీనాడు మీపాద పూ
జలు గావించి తరించె నాదుకరముల్ బాలున్. మహాతృప్తి, యీ
జలముల్ నాశిరమందు జల్లుకొన నా చారిత్రమున్ పృథ్విలో
వెల లేనంతటి కీర్తిబొందు విఠలా వింటౌను నాసేవయున్

(పాదములపై తలయుంచును)

పురం: (ఆనందమున లేచి అన్నమాచార్యుని కౌగిలించుకొని)

అరరే! యెంతటి పుణ్యవంతుడను నే నయ్యా! బచత్సేవచే
తరియింపన్ జనుదెంచితిన్ కడు విరుద్ధంబయ్యె నీరీతియున్
పరమాత్మా? నను పూజచేసితివి యే మాత్రంబు నూహింపనీ
సరి రానే నెటు మీకు నెప్పటికి ఓ స్వామీ! ననున్ బ్రోవుమా!

(అన్నమాచార్యుల చేతులు పట్టుకొని కళ్ళకద్దుకొనును)

అన్న. (పురందరుని చేతులు పట్టుకొని) దేవా! క్షమించాలి, మీరు నన్నట్లు కోరరాదు, మీరు శ్రీ పాండురంగవిఠలుడని పూజించితిని, మీలో నేను ఆ పాండురంగవిఠలుని చూచుచున్నాను, అంతియేకాని నన్ను మీరు వేరుగా బావింపకుడు.

పురం. (చిన్నగనవ్వి) దేవా! అన్నమాచార్యా! మీరు సాక్షాత్ శ్రీ వేంకటేశ్వరుల స్వరూపమని లోకము వేనోళ్ళపొగడ విని మిమ్ము దర్శింప వచ్చితిని, కాని నన్నే మీరు పరమాత్మునిగా భావించుట, నాజన్మ పవిత్రమైనది దేవా! పవిత్రమైనది, (పరధ్యానమున కన్నులు మూసికొని)

ఏమితపం బొనర్చి జని యించిన వాడనో పాండురంగ నే
నీమహనీయు పూజగొన నియ్యది నీమహిమంబె గాని ఓ
స్వామి తరించె నిన్ బొగడ సాదుగుణోత్తముడైన విష్ణు మౌ
నీ మము జేర్చితీవె యిక నీయిల నాకిదె చాలు చాలికన్

**పండరీపురవాసా!** యీ జన్మలో యిక యింతకన్నా నాకు మరేమియు వలదు విరలా వలదు,

విష్ణు అయ్యలారా! మీరిర్వురు దైవాంశసంభూతులు, మీలో పరమాత్మ స్వరూపులయిన శ్రీ హరి వేరువేరు నామముల, వేరువేరు రూపముల వెలసినాడు మీలోని దివ్యస్వరూపములకు నా అభివాదములు, ఇటు శ్రీ వేంకటేశ్వరులు అటు పాండురంగడు, నాఆశ్రమము చేరుటచే నేనీ లోకమున చరితార్థుడనైతిని,

పురం ఆహా! ఆహా! మీ వాక్యములెంత పవిత్రమైనవి, మునిదేవా! ఇది యంతయు మీకరుణ యని తలంతును,

అన్న: గురుదేవా! మీ అనుగ్రహమున నేనింతవాడనైతిని మీ యాదరణయే లేకున్న మహనీయులైన యీ పురందరుల దర్శనము నాకెట్లు గలుగును, శ్రీ పాండురంగని పాదపూజ చేయుభాగ్యము యెట్లు లభించును,

విష్ణు: అయ్యలారా! ఇదియంతయు దైవనిర్ణయము, మనము కారణభూతులము, మనలను ఆ దేవదేవుడే నాటక మాడించుచున్నాడు, ఏది ఏమయినను, ఈ దినము మహాపర్వదినము ఈ దినముకొరకే నేనెదురు చూచుచుంటిని

పదకవితా పితామహుని పండితవర్యుని అన్నమయ్యనున్
మధుర రసార్ధ్ర గానసుద మాన్య పురందరదాసునిన్ గనన్
సుదినము గాదె యిద్ది యొక చోటనె యిర్వురు చేర భక్తులై
పదములు రెండునొక్కటగు భక్తియు నేమము నివ్వటిల్లగన్

అయ్యలారా! మీరు ధన్యులు నాయనా! సంగీత సాహిత్యములకు సార్థకతను చేకూర్చిన వేదాంతమూర్తులు, అన్నమాచార్యా! పురందరా! మీరు పరమభాగవతోత్తములు, నాకింక సెలవు దయచేయుడు, నేను **తపోవనమునకు** వెళ్ళెదను, మీరిర్వురు కలియుటకొరకే **వేచియుంటిని,** ఆపని పూర్తియైనది, కుమారా! **అన్నమాచార్యా!** ఈ అక్కలమ్మను

కంటికి రెప్పగా కాపాడుచుండుమయ్యా! అమ్మా! అక్కమాంబా! శ్రీ వేంకటేశ్వరుడు, అలుమేలుమంగమ్మ, సర్వదా మీయండ నుందురు, మీరు సుఖులై, యీపృథ్విని జీవింతురుగాక,

అక్క: (విష్ణుముని పాదములకు నమస్కరించును)

విష్ణు: అయ్యలారా! మీరిర్వురూ, కలియుటే, ఒక పర్వము, మీరిర్వురు శ్రీవారిపైని అలిమేలుమంగమ్మపైని కొన్ని కీర్తనలు వ్రాసి, యీ కలియుగమున, చిరంజీవులై తరించి దైవసాన్నిధ్యమును చేరుకుందురుగాక, నాయనా! అన్నమాచార్యా! మీసంతతియు మీవలెనే శ్రీ వేంకటేశ్వరుని భక్తులై కవితలల్లి మీకీర్తిని ఈ భూమిపై ఆచంద్రతారార్కముగా ప్రకాశింప జేయుదురుగాక, అయ్యలారా ఇక నాకు కాలాతీతమగుచున్నది,

సర్వేభ్యో సన్మంగళాని సంతు ఆత్మపరమాత్మలు దైవమానవములు సంగీతసాహిత్యాలు, సాహితీవేదాంతాలు, మధుర మాధవ భక్తిప్రపత్తులే అన్నమాచార్య, పురందరుల దేదీప్యమాన సమావేశం-దివ్యసందేశం-శ్రీ మహావిష్ణుల నందకాంశ మహోపదేశం-అస్తు-యోస్తు-విజయోస్తు-దిగ్విజయోస్తు- మీకిదే నాకడసారి ఆశీర్వాదము, ఓం శాంతిః శాంతిః శాంతిః

అంద: (శ్రీ విష్ణుముని పాదముల ముందు మోకరింతురు)
(తెరలో) (సుప్రభాతములోని మంగళాశాసనం)

శ్రీ వైకుంఠవిరక్తాయ స్వామి పుష్కరణీతటే రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళం॥

(తెర పూర్తిగా వ్రాలును)

మంగళం

(నమస్తే)

